BAPU REDDY GEYANAATIKALU

*Collection of Musical Plays*

*by Dr. J. BAPU REDDY*

*Third Enlarged Edition* : 1986

ప్రథమ ముద్రణ : 1970

ద్వితీయ ముద్రణ : 1973

తృతీయ విస్తృత ముద్రణ : 1986



**వెల : 25/-**

జయం ప్రచురణలు

ప్లాటు నెం. 10, రోడ్డు నెం. 5

జూబిలీహిల్స్, హైదరాబాదు–500 034

ముఖచిత్రం : శ్రీ మడిపడగ బలరామాచార్య

ముద్రణ :

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్

హైదర్‌గూడ, హైదరాబాదు–500 029

# ఇందులో....

# అంకితం

కళాతపస్వి చిత్రజగద్యశస్వి

శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారికి

# అక్షరాక్షతలు

( కావ్యాంకిత గేయ రూపకం )

భావసఖి : ఏమి టమ్మా ! ఏమి టమ్మా !
ఇంత సంబరము
గెలిచిన ట్లున్నావు , ఈ భూ
తలము అంబరము !

వెదకి కొన్నది దొరికి నట్టుల
పందె మందున నెగ్గి నట్టుల
కలలు గన్నది కాంచి నట్టుల
వెలుగుచున్నవి నీదు కన్నులు !

అంత వింత విశేష మేమో
ఇంతలో నీ వింత యైతివి
ఈడు వచ్చిన కావ్య కన్యా !
ప్రీడ వీడి తెలుపు మమ్మా !

కావ్య కన్య : చెప్పలేనిది చెప్పు మందువు
సిగ్గుమాలిన చెలియ నీవు
మనసు మనసే కరిగి పోయే
మాట లెందులకే !

ఆరు ఋతువులు కలయ వెదకి
అవని చంద్రావనిని వెదకి
చేరితిని నా భావిజీవన
జీవితేశ్వరుని .
చేతనా విజయాల హేలల
చేసితిని కల్యాణ యాత్ర
చేరితిని అనుభూతి సాగర
సౌధ సీమలకు .

* * *

భావ సఖి : ఎవరే ఎవరే అంతటి మన్మథు డెవరే !
ఎవరే ఎవరే అంతటి నీ వరు డెవరే !

పాటల కన్నియవౌ నీ చక్కని
మాటల కందని మేటి ,
రస జగాలె పరవశ మొందెడి నీ
రాగము గెల్చిన కోటి – ఎవరే....

కావ్య కన్య : సుందర వేణుమరంద గీతికా
బృందాలోల విలాసుడే
నటన కళా హిమనగ నవరస
మానస సరోవర నివాసుడే .

భావ సఖి : ఎవరే ఎవరే అంతటి మన్మథు డెవరే !
ఎవరే ఎవరే అంతటి నీ వరు డెవరే !

కావ్య కన్య : తారాపథ సంచారి నా బ్రతుకు
దారుల విరిసిన ఆమని
కళాధిపుడు గుమ్మడు నా మదిలో
కాంక్షలు కురిసిన నభోమణి .
ఆ గుమ్మడికే అంకిత మయ్యేను
నా గానము నా భావము
ఆ రసరాట్టుకు ఆ స్వరాట్టుకే
అర్పిత మయ్యేను ప్రాణము !
* * *

భావ సఖి : గుణము చూచి ప్రేమించినావా ? రూప
ధనము చూచి ప్రేమించినావా !
నీవే ఆతనిని వలచినావా ? లేక
నిన్ను కూడా అతడు వలచినాడా ?

కావ్య కన్య : రాగ ద్వేషాలకు కారణములు చెప్పుట వశమా !
మా ప్రణయ రహో బంధమ్ముల ముడి విప్పుట వశమా !

నారాయణుడే , మాలో నాటెను ఈ రాగలతలు
కనిపించని ప్రేమపరాగాలె, కలిపె మా ఎదలను
కామరూపియే ఆతడు కాముడే తగిన జోడే
అతనికి గుణమున మాత్రము అతనుడు సరిరాడే !

మితభాషి మనోజ్ఞ దరస్మితవదన రస పిపాసువు
చిత్ర చిత్ర జగత్తులకు చిన్మాత్రము దయాళువు !
భావ గోపురాలతోడ జీవన స్తంభాల మీద
నిలుపుకొన్న కోవెలలో వెలసిన వేంకటేశుడే !
* * *

కావ్య కర్త : విన్నానమ్మా ! నీ
వెన్నెల పాటలు , మాటలు
కన్నానమ్మా ! నీ
కమ్మని కోర్కెల తోటలు .

నా కవితా కేదారము
లో కను విప్పిన సుమమా !
రాగ వసంతుని పరాగ
రాజ్య మేలుకొనుమా !

వలచిన వలపించు కొన్న
వరుడు వచ్చి నాడమ్మా !
రాకుమారుడై నిన్ను
చేకొన వచ్చాడమ్మా !

కవులు , పండితులు , వక్తలు
గాయకులు , కళాకారులు
సహృదయులు , రసజ్ఞులు ,
వచ్చారమ్మా ! స్త్రీ పురుషులు—

ముచ్చటగా నీకు మూడు
ముళ్ళుపడే ముూర్త మయ్యె
పదవమ్మా ! కల్యాణ
వాద్యమ్ములు విన నయ్యె !

*　　*　　*

నేపథ్యం :　పొంగి పొంగి దీవించెను
శరధి తరంగాలు–ప్రేమతో
వంగి వంగి దీవించెను
గిరుల మహాశృంగాలు - మమతతో

దీపించెను దీవించెను దివాకరుని కిరణాలు ,
దీవించెను ప్రేక బోయి దిగ్గజ వర కరాలు .

నరులే నారాయణులై హితులే దేవతలై
దీవించిరి సహృదయులే భావాంబర విహారులై .

భీమన్నలు , రామన్నలు , విద్యావర సంపన్నులు
ఆశీర్వచనాక్షతలు ఆనందమ్మున చల్లిరి !

కళా మహా సాగరునికి కవితా గంగా ఝరికి
పచ్చని సాహితీ మంటపమున జరిగె కల్యాణము !

# అభిజ్ఞుల అభిప్రాయాలు

## డా॥ బోయి భీమన్న

[ఇందులోని రాకెట్టు రాయబారం నాటిక గూర్చి 1964 లో....]

మిత్రమా, బాపురెడ్డీ!

నీ రాకెట్టు రాయబారం సఫలమనోరథమై తిరిగివస్తూ నా ఆతిథ్యాన్ని కూడ స్వీకరించింది—నీ ఆదేశం మేరకు !

ప్రాతవీ, క్రొత్తవీ, ఎన్నో రాయబారాలు చూశానుగాని—

అంగద రాయబారం, సంజయ రాయబారం, శ్రీకృష్ణ రాయబారం వంటి వన్నీ విఫలమైనట్టివే.

హంస రాయబారం, అగ్నిద్యోతన రాయబారం వంటివి కేవలం వైయక్తి ప్రణయాత్మకాలు.

సర్వమానవలోక శ్రేయస్సును కాంక్షించిన నీ రాకెట్టు రాయబారం వంటి అతిలోకసుందరపథకం, అత్యంత రసవద్రచన, అద్వితీయ సమర్థవన్నిర్వహణ చూడలేదు నే నింతవరకు ! ధన్యుడవు, మిత్రమా, ధన్యుడవు !

నిన్ను మిత్రమా అని పిల్చే భాగ్యం కలిగిన నేనూ ధన్యుణ్ణే !

"అపారే కావ్యసంసారే" అన్న ఆర్యోక్తి జ్ఞాపకంవచ్చింది నాకు రాకెట్టు రాయబారం చూచినప్పుడు.

మానవుడి దృష్టి అంతరాళం మీదికి ప్రసరించినప్పుడే - దాన్ని అతడు జయించితీరతాడన్న విశ్వాసం కలిగి, చంద్రమడలం మీద దిగుతాడన్న భావం మెరిసింది నీలో! అదే క్రాంతదర్శనం ! సైన్టిష్టు ఇంకా అంతరాళంలో గిరికీలు కొడుతూ వుండగానే, కవి రాయబారి (రాకెట్టు) చంద్రలోకానికి వెళ్ళి, రాణి చంద్రకాంతతో మాట్లాడి వచ్చేసింది !

ఇది కదయ్యా ఋషిత్వం !

చంద్రకాంత ఎంత ఆనందంతో స్వాగతం చెప్పింది - మానవ జగము పంపిన రాయబారికి—

"ఎన్నాళ్ళయింది బైలుదేరి ? లక్షలాది మైళ్ళు ప్రయాణించేసి వచ్చావు. ఈ అమృత సికతా తలాన విశ్రమించు. భూలోక క్షేమవార్తలను చెప్పి, నా హృదయభూమిని పండించు" అంటూ !

"క్షేమమేనా జగజ్జననికి ? - క్షేమమేనా జగజ్జనతకు !"

విశ్వశ్రేయస్సునే కవితా పరమార్థంగా తీసుకొన్నది కాబట్టే నీ లేఖిని, మానవు లనుకొనేదానికంటె అంత సుందరంగా, ఉదాత్తంగా చిత్రించ గలిగింది చంద్రకాంతను !

"ఏమిటేమిటీ భూవాసులు నా సీమకు రానున్నారా !
నా విశాల నిర్జనభూమికి ప్రాణమ్ములు తేనున్నారా ?
పూచేనా నా పెంచిన ఆశలు ? వీచేనా గంధములు ?
చైతన్యము నా ఎడారి బ్రతుకున చిందేనా అందములు ?"

భూవాసులు చంద్రగోళానికి రానున్నారన్న వార్త పరవళ్లు త్రొక్కించింది చంద్రకాంత హృదయాన్ని ఆనందంతో ! ఇంతవరకు నిర్జనంగా పడివున్న తన జీవితాన్ని చూచుకొని ఒక నిట్టూర్పు విడిచింది—

"అనుభవించెడివారు లేనపు డమృతమునకును విలువ కలదా ?"

ఒక చంద్రకాంత నిట్టూర్పేనా ఈ రెండు పంక్తులలో వున్నట్టిది? విలువలు గుర్తించబడని సతుల, సాధువుల, సాహితీపరుల నిట్టూర్పులు అనంతంగా కరుణ రసవాసనలు వీచడంలేదా ఇందులో ? " గంగాయాం ఘోషః"అనే ఒక్క ఘోష తప్ప, మరో లక్షణ తెలియని లాక్షణికులకు కనువిప్పు కాదా ఇది ?

మానవుడు తన దగ్గరకు వస్తున్నాడన్న వార్త తెలిసి, అంత ఆనంద పారవశ్యం పొందిన చంద్రకాంత, ఒకవేళ రాడేమో అన్న సంశయంతో, తప్పక రావాలన్న సమీప్సతో ఎంతసతమతమై పోతుంది !

"ఈ కొండలలో కనకము కలదని- ఈ ఇసుకలోన అమృత మున్నదని
.... .... .... .... .... .... ....
ఎరిగించుము సాహసులౌ నరులకు"

మానవుడు నాయకుడు, చంద్రకాంత నాయిక, రాకెట్టు అగ్నిద్యోతనుడు!

చంద్రకాంత వద్దకు మానవుడు పంపిన రాకెట్టు - అక్కడి నుంచి మానవుడికి చంద్రకాంత తరపు రాయబారి అవుతుంది !

మానవలోకంపై తనకున్న ప్రేమను—

"నను జూచి ఆనందమున పొంగు నీరాకరముల గని, నా రాక గని నంతనే రాగములు పెంచు కలువపూలను చూచి, పొంగి పూర్ణానందమూర్తినై పోతాను ? అమృత భావజ్యోత్స్నా పూర్ణిమ నౌతాను! స్వార్థం హింసాకాండ జరిపే టప్పుడు, ఈతిబాధలు మానవుణ్ని ఏడ్పించేటప్పుడు, నా గుండె తరుక్కుపోయి, నా కన్నుల్లో నిశీథం క్రమ్ముకొంటుంది" అంటూ - ఎంత వ్యగ్రతతో వెలి బుచ్చుతుంది !

అమావాస్య ఎంత సహజంగా సమర్థించబడింది ఇక్కడ! సాహసుడైన నరు డనడంలో నీవు సాధించిన ధ్వని ఈ కాలంలో అపురూపం కదయ్యా !

చంద్రకాంతను ప్రశంసిస్తూ—

"నిను గన్న సృష్టి ఎంతటి ధన్యురాలు !
నీలోన కరుణాప్రభా ఝురులు పారు !
.... .... .... .... .... .... ........
నిను జూడ కవుల గుండెలు పొంగి పారు
నీ రూపు, నీ వెల్గు, నీ మాట లేక
కావ్యమ్ము లేదు, చక్కనిగాథ లేదు"

అంటూ, రాకెట్టుతో అనిపించి - "సృష్టిసౌధములో క్రొత్తతలుపు నొకటి" తీసిన బాపురెడ్డి !

రాకెట్టు రాయబారం ఒక్కటీ ఒక మహాకావ్యం అనగలను గాని, పద్యం వ్రాసిన ప్రతివాడూ ఒక మహాకవిగా చెలామణీ అవుతున్న ఈ రోజుల్లో నిన్ను మహాకవి అని ఎలా అనగలను ? అందుకే ఋషి అంటున్నాను !

"నీ రూపు, నీ వెల్గు నీ మాట లేక కావ్యమ్ము లేదు, చక్కనిగాథ లేదు" అన్న రెండు పంక్తులూ మొత్తం విశ్వసాహిత్య హృదయాన్నే సమీక్షిస్తున్నాయికదా!

చంద్రకాంతే కావ్యాత్మ !

చంద్ర (తారా) గాథే సకలవిశ్వప్రణయానికి వ్యంగ్యోక్తి.

పరకీయాప్రణయప్రాణకమైన గాథాసప్తశతి వంటిది - ధ్వని ప్రాధాన్య వృత్తివల్ల - ఉత్తమ కావ్యం కనుక, అదే హేతువువల్ల తారాశశాంకం ఉత్తమ కావ్యమే. తారాశశాంకగాథ విశ్వప్రణయ వ్యంజకం. అట్టి సుందరగాథకు వ్యంజకమైన నీ "గాథ" పదప్రయోగం ఎంత సుందరం !

రాకెట్టు రాయబారం ఒక మహాకావ్యం - ఏ దృష్టితో చూచినా.

దీనిలోని ప్రతి వాక్యమూ రసాత్మకమే. ప్రతి శబ్దమూ రమణీయార్థ ప్రతిపాదకమే.

## డా॥ దాశరథి

శ్రీ బాపురెడ్డి గేయ నాటికలు చదివిన వెంటనే అప్రయత్నముగా నాలో నుంచి :

"గేయ నాటికలు – కావ్య వాటికలు
రమ్య చేటికలు – రత్న పేటికలు"

అన్న పంక్తులు వెలువడినవి.

బాపురెడ్డి రచనలు చాలా కాలంగా చదువుతున్నవాణ్ణి నేను. అతనిలోని స్ఫూర్తికి ముగ్ధుణ్ణవుతున్న వాణ్ణి.

అసలు నాటికలకు గేయం ఎంతవరకు ఉపయోగపడుతుంది ? అని సందేహం వ్యక్తపరిచేవారు చాలా మంది ఉన్నారు. నాటికలోని పాత్రలు సహజంగా మాట్లాడుకోవాలి గాని పాడట మేమిటి? అని కొందరు ప్రశ్నించారు. ఒకానొకప్పుడు వచన నాటికలలోనూ అక్కడక్కడ పాటలు గాని, పద్యాలు గాని పొదగడానికి అనుకూలుణ్ణి నేను. పాత్రల హృదయాల నుండి మాట రావచ్చు, పాటా రావచ్చు. దైనందిన జీవితంలో మనం మాట్లాడుకునేటప్పుడు పాడుకుంటామా ? అని పూర్వపక్షం చేస్తారు కొందరు. కవిత కేవలం దైనందిన జీవిత ప్రతిబింబం కాదు, కారాదు. అట్లా అయిన నాడు కవిత ఛాయాచిత్రమై కూర్చుంటుంది. కవిలో కొంత అలౌకికత వుండాలి. ఆ అలౌకికతకు ఒకానొక ఉదాహరణ గేయం. అంతమాత్రాన గేయ నాటిక కృత్రిమమైన ప్రక్రియ కానే కాదు, ఇదీ సజీవమైన ప్రక్రియే.

"ఋతురాగం"లో వర్షాసుందరి

"కడలిలోని నీరు–
మబ్బు కడవలతో మోసి తెచ్చి
మండిపోవు పుడమితల్లి
గుండెసేద తీర్చినాను" అన్నప్పుడు

సజీవమైన ఒకానొక పాత్ర పలికే మాటలుగానే భాసిస్తుంది.

బాపురెడ్డి గడుసు కవి. గేయం లోనూ వచనమంత సాఫీగా సంభాషణలు నడిపించగల శక్తి మంతుడు. తిక్కన సూరనలు పద్యాల్లో పకడ్బందీగా సంభాషణలు నడిపించి కృతార్థులు కాలేదా ?

రచన ప్రయోజనాత్మకంగా వుండాలనే అభ్యుదయ దృష్టిగలవాడు బాపురెడ్డి. కనుకనే కేవలం ఊహాలోకంలో కాకుండా దైనందిన సమస్యల నెన్నిటినో తీసుకొని వాటిలో కవితను పొదిగి చక్కని కళాఖండంగా రూపొందించగలడు. "భావి జీవులు" అనే గేయనాటిక నేటి కుటుంబ నియంత్రణపై ఆధారపడింది.

అసలు ఈ విషయం తీసుకోడానికే కవులు జంకుతారు. ప్రచార సాహిత్యమై పోతుందేమో అని వెనుకాడుతారు. కాని, నేడు దేశాన్ని కలవరపరిచే జనాభా సమస్యను నిజమైన కవి మరువలేడు. అందుకే బాపురెడ్డి "భావి జీవులు" రచించాడు. విజయం సాధించాడు.

"భావి జీవులు" అంటారు :-

బయలుదేర నున్న మమ్ము పట్టి అపుదు రెట్లు
గళము జారకుండ హరుడు గరళము బిగబట్టినట్టు"

ఈ పంక్తులు సంతాన నిరోధాన్ని కళాత్మకంగా చెబుతున్నవి.

"భాజకమును పెంచి, భాగఫలమును తగ్గించుటేల?" అన్న పంక్తులు నేటి ఆర్థిక స్థితిని కుదించి చెబుతున్నవి.

అలాగే "రాకెట్టు రాయబారము" కూడా సమకాలిక విషయమే.

ఈ రెండు నాటికలు కాక అత్యంత భావ బంధురములై కళాత్మకములై సామరస్యబోధకములైన నాటికలలో ఒకటి "ఋతురాగం". ఇందులో:-

"ఒకరు లేక ఒకరు లేరు సకలము ఎవ్వరు కారు" అని కాలపురుషుడన్న మాట అన్ని విధాలా గొప్ప సూక్తి. అన్ని ఋతువులూ కావలసినవే. ఒకటి గొప్పది ఒకటి తక్కువది కాదు. అదే విధంగా మానవులంతా కావలసినవారే. ఏకతా భావం ఉన్న నాడు మానవులు శోభిస్తారు. అది లేని నాడు క్షోభిస్తారు. ప్రతి ఋతువు తన తన ఘనతను చెప్పుకోవడాన్ని బాపురెడ్డి ఎంతో రమణీయంగా ఈ గేయ నాటికలో పొందుపరచాడు.

కాలపురుషుడు ఋతువులతో అంటాడు :-

"నా అనంత జీవన గంగా చలత్తరంగాలు" అని. తరంగాలు వేరైనా గంగ ఒక్కటే. అలాగే ఋతువులు వేరైనా కాలప్రవాహం ఒక్కటే కదా!

గ్రీష్మ ఋతువు "శిరముపై చండరవి ఖాండము వహించి" వచ్చిందట ! ఎంత నూతన కల్పన ! మరో చోట శరద్బాల వర్ష ఋతువును గూర్చి చెబుతూ "శంపా సర్పాలు—" అంటుంది. భావుకుడైన కవికి శంపలు సర్పాల్లా కనిపిస్తాయి.

"సాగర సౌధం" తెలుగు వారి కలలపంట యైన నాగార్జున సాగరమును గూర్చినది.

ఈ నాటికలో ప్రజాశక్తి అంటుంది. "రాజులు-రారాజులు చేయలేని కార్యమ్మును చేతుము నీ కొరకై—". ప్రజాశక్తిని మించిన శక్తి లేదు. తెలుగు జాతి చరిత్రలో ఎన్నడూ జరుగని గొప్ప సంఘటన నాగార్జున సాగర నిర్మాణము. "జలసౌధమును మహోజ్జ్వల సౌధమును కట్ట నడుములు బిగించితిమి" అంటారు ప్రజలు.

"ప్రజలు ఏకతా శస్త్రము చేకొనువేళ" మంచి ముహూర్తమట ; భేష్ !

బండలెత్తుకొని రండి బంగార మదేనండి !

సుత్తెలు మ్రోగించండి సురదుందుభు లెందుకండి ?"

ప్రజా స్వామ్యంలో బండలకున్న విలువ బంగారానికి ఉండరాదు.

ఈ నాటికలో కవి మహోద్రేకంతో గానం చేశాడు. కృష్ణవేణిలా నడిచింది రచన.

నాకు బాపురెడ్డి రచనలో కనిపించిన ఉత్తమ లక్షణం స్పష్టత, పాఠకునికి అర్థంకాని రీతిని ఏదో చెప్పి అందులో యేదో అనిర్వచనీయమైన "లోతు" వుందనే భ్రమ కలిగించడు. బాపురెడ్డి ఇజాల ఋజాలు తడమడు. నిజాలను సజావుగా తెలుసుకుంటాడు. ఆడంబరాల అంబరాలెక్కడు. పీతాంబరాలు కట్టడు. సౌలభ్య. వాల్లభ్యాలను విడువడు. లోచూపు కలవాడు, కవితలో తీపి పెంచిన వాడు. చేదు పంచని వాడు. ధోరణిచూస్తే పుంఖానుపుంఖంగా వ్రాయగలడని పిస్తున్నాడు. గుండెను కదలించే నిండైన మెండైన కవిత వ్రాస్తున్నాడు. తెలుగు జగతికి అందిస్తున్నాడు. అతడు తెలంగాణ ముద్దుబిడ్డడే కాదు. మొత్తం తెలుగు జాతి ముద్దు బిడ్డడు. భారతమాత ముద్దు బిడ్డడు. ఎల్లలను ఒల్లనివాడు.

## డా॥ చేకూరి రామారావు

గేయ నాటికలు ఇటీవల చాలాకాలంగా చాలామంది రాస్తున్నారు. శివ శంకర శాస్త్రి తర్వాత దీన్ని బాగా సాధన చేసింది నారాయణరెడ్డి గారు. ఆయన ఆ ప్రక్రియను చాలా కాలం క్రిందటే వదిలేసినట్టుంది. దాన్ని మళ్ళీ చేపట్టిన గౌరవం బాపురెడ్డిదే నని చెప్పవచ్చు. గేయనాటికలు రేడియో ప్రసారానికి; కాలేజీ వార్షికోత్సవాల్లోను, సాంస్కృతిక కార్యక్రమాల్లోను ప్రదర్శించటానికి బాగుంటై. ఇది జనరంజకమైన ప్రక్రియ. బాపురెడ్డి గేయనాటికలు కూడా ప్రదర్శనాను కూలమైనవి.

బాపురెడ్డి మాత్రా ఛందస్సుల్లో బాగా అభ్యాసం చేసాడు. చదువుకోటానికి పాడుకోటానికి అందంగా ఉండేట్టు రాస్తాడు. సాధారణంగా "లయ" తప్పడు. అవసరమైతే లయ తప్పించి అయినా వచన గేయంలాగా నడిపించటానికి వెనకాడడు. "భావిజీవులు" లో దేశకాలాలు అప్పుడప్పుడు వచనగేయంలో మాట్లాట్టం మనం గమనించవచ్చు. శ్రుతిపేయంగా ఉండటం కోసం బాపురెడ్డి యతులతో పాటు అంత్యప్రాసల్నికూడ ఆశ్రయిస్తాడు. ముఖ్యంగా నాలుగు పాదాల మాత్ర పద్యంలో సరిపాదాల చివరల శబ్దసామ్యం పాటించటం ఈ కవికి ఒక అలవాటు.

మదీయ జీవనరాగంలో, కల
మయురబాలలు నాట్యము చేసె
మదీయ క్రీడాజలపాతాల
మహత్వ విద్యున్మాలలు పూచె [ఋతురాగం]

ఇట్లాంటి ప్రాసలు తరచుగా వేస్తూపోవటం వల్ల గేయం హాయిగా సాగుతుంది. గేయంలో రెండు రెండు పాదాల మధ్య సమ భారతని సాధించడానికి వీలున్న పద్ధతులన్నటిని బాపురెడ్డి వాడుకుంటాడు. అంత్యప్రాస, మాత్రా గణ సమత్వం మాత్రమే ఈ సమ భారత్వం సాధించలేవు. భిన్నవాక్య, వాక్యాంశ నిర్మాణంలో సమరూపతకూడ ఇందు కవసరం. పైన పేర్కొన్నచోట సరి పాదాంతాల్లో సమాపక క్రియాప్రయోగం ఇందుకు దోహదం చేస్తున్నది. ఇవి రెండు భూతకాల క్రియలు. ద్వ్యక్షర ధాతువులు. ధ్వనిస్సామ్యం (Phonetic Similarity) తో పాటు వ్యాకరణ స్సామ్యం (Grammatical Similarity) కూడా పెంచుతూపోతే గేయానికి సమభారత ఇనుమడిస్తుంది, అందం చేకూరుతుంది.

భాగ్య దేవత శింజినీ శింజితాలలో
నా ఆకలికేకలు వినబడునా ?
కనులలో కదలాడు కలల వెన్నెలలో
నా వంగిన నడుమే కనబడునా ? [కల్యాణయాత్ర]

ఇందులో బేసి పాదాలలోనూ, సరిపాదాల్లోను అంత్యప్రాస పాటించబడింది. సరిపాదాల్లో ఏకకాలికాలయిన సమాపక క్రియ లున్నై. రెండు క్రియలూ ప్రశ్నార్థక శబ్దాంతాలు. రెండు అకర్మక క్రియలు. రెండూ ద్వ్యక్షర ధాతువుల మీద నిర్మించబడిన శబ్ద పల్లవ క్రియలు. రెండూ రెండు ప్రధానమైన ఇంద్రియ వ్యాపారాలను సూచిస్తున్నాయి. ఈ సామ్యాలు అంత్య ప్రాసవల్ల వచ్చే అందాన్ని గుణిస్తున్నై.

పాదాల ప్రారంభంలో కూడా వ్యాకరణ సామ్యం ద్వారా ఈ సమత్వాన్ని ఇంకా స్ఫురింప జేస్తాడీ కవి. ఉదాహరణకు :

నా రాకే లోకానికి
నవభావన నాకము
నా పాటే జనావళికి
దీపావళి పర్వము [ఋతురాగం]

ఇందు మొదటి రెండు పాదాలు కలిసి ఒక వాక్యం, చివరి రెండు పాదాలు ఇంకో వాక్యం. సరిపాదాలతోపాటు బేసి పాదాల్లో కూడా అంత్య ప్రాసలున్నై. ఇవికాక రెండు వాక్యాల ఎత్తుగడలో ఏకత ఉంది. 'నారాకే' 'నాపాటే' అనే మాటలకు మాత్రా సమత్వంతో పాటు అక్షర సమత్వం (Syllabic Similarity) ఉంది. ఈ రెండు కూడా అస్మదర్థక సర్వనామం విశేషంగా ఉన్న నామ బంధాలు. రెండూ అవధారణార్థక శబ్దాంతాలు. ఇన్ని విధాల సామ్యం ఉండటం వల్ల గేయంలో రెండు దళాల మధ్య సామ్యం అధికమైంది. ఇట్లా గేయాన్ని ఎన్ని రకాలుగా అందంగా మలచటానికి వీలుంటుందో అన్ని అవకాశాలనూ బాపురెడ్డి ఉపయోగించుకుంటాడు

వాడుకలో ఉన్న త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర గతులతో సంతృప్తి పడక బాపురెడ్డి వీటి మిశ్రమంతో కొత్త గతులను సృష్టించుకొని వాడుకొన్నాడు. కొన్ని ఉదాహరణలను గమనించండి.

వెన్నతోనే నాకు పెట్టిన విద్దెలు
ఎన్నటికి విడిపోని ఉన్నత బుద్ధులు

ఇక్కడ ఖండ చతురశ్ర గతులు (5, 5, 4, 4 మాత్రలు) (ఋతురాగం) కలిసినై.

నేను నడచిన బాటలలో
నేను నిలచిన చోటులలో (ఋతురాగం)

ఇక్కడ ముత్యాలసరంలో వాడే మిశ్రగతి, చతురశ్ర గతులు (3,4,2,2 మాత్రలు) కలిసిపోయినై.

మత్తిల్లిపోయె జగమంత చూడు
మాయలో పడె ప్రకృతికాంత నేడు (ఋతురాగం)

ఇక్కడ ఖండ త్రిశగతి (5, 3, 5, 3) మాత్రాగణాలు మిశ్రమం అయి కొత్తగతి తయారైంది. దీన్ని (4, 4, 4, 4) పద్ధతిలో గూడ గణ విభజన చేయవచ్చు కాని ఇది కవ్యుద్దిష్టం లాగు కనపడదు : ఇంకో పద్ధతి 2, 3, 3, 2, 3, 3, మాత్రా గణాల విభజన. ఈ పద్ధతి మొదటిపాదానికి సరిపోతుంది కాని రెండోపాదానికి సరిపోదు. ఈ పద్ధతికి ఆధారం ఉచ్చారణలో ఊనిక స్థానం. అంటే అప్పుడు ఉచ్చారణ ఇట్లు ఉంటుంది.

మత్తి'ల్లిపో'యె జగమంత చూడు.

ఉచ్చారణలో మూడు మాత్రల గణాద్యక్ష్యరం మీద ఊనిక ఉంటుంది. (ఊనిక-Stress-కు గుర్తు) అప్పు డది త్రిశగతిలోనే ఒక భేదం అవుతుంది. ఏ రకం నడకకైన రెండోపాదంలో గతి తప్పింది. ఇక్కడ గణవిభజన సరిపోతుంది గాని గతిస్ఫురణ లేదు—అందుక్కారణం గణాద్యక్షరం మీద ఊనిక ఉండేట్టు పదాలను ఎన్నుకోకపోవటం.

పై పద్ధతి ప్రయోగం పఠాభి (పట్టాభిరామరెడ్డిగారు) చేశారు.

'ఆనంద సరసి రాయంచ సరణి
విహరించు చుండి మోహాల బరణి
సంతోషితాత్మ స్వాధీన పతిక
రమణీయ దివ్య లావణ్య లతిక'.

ఇదే పైన బాపురెడ్డి చేసిన ప్రయోగంలాంటిదే. ఇక్కడ కూడా పైన చర్చించిన పద్ధతుల్లో గణవిభజన చెయ్యోచ్చు.

ఇట్లా ఛందస్సుల్లో బాపురెడ్డి చాలా ప్రయోగాలు బుద్ధిపూర్వకంగా చేసినట్టు కనిపిస్తున్నది..... ..................

## A neat & crisp Telugu Play

[*Drama Critic, The Times of India, New Delhi Nov. 20, 76*]

*It is a paradox that people living on the banks of a perennial river should starve of water and witness helplessly the life-giving waters flow down into the "wastes" of the sea. Then suddenly one day, the multitude of people rise as one and seek to harness the waters of the river for the good of the riverine community. And a giant structure is erected across the stream and the waters diverted into canals big and small. The land smiles and crops swing in grace in the eastern breeze.*

*This may read like the synopsis of a propaganda feature. But it is a fact of history presented as a play in Telugu verse titled "Sagara Soudham" by the talented young writer J. Bapu Reddy. The play was staged as part of the week–long cultural festival organised to celebrate the completion of two decades of the formation of Andhra Pradesh, at Kamani Auditorium yesterday. The theme is based on the tale of woes of the water–starved people of the Krishna basin, their dream and its fulfilment in the shape of the Nagarjuna Sagar dam which has transformed arid lands into lush green fields*

*The young members of the Goutama Bala Vihar of Nagarjuna Sagar attired in folk costumes sang and danced in unison with absolute ease. Their presentation of the various sequences in history down. to the present day were very convincing, may be because it is their fathers and fore–fathers who figure in the saga. R. V. Prasada Rao's musical score was pleasing and the dances composed by Jaisuryam were simple and authentic. The performance was neat, crisp and engaging.*

# సత్య సాహిత్య స్వరాలు

నృత్య గేయ రూపకాలు తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక ప్రక్రియగా విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్నాయి. అయితే సాంప్రదాయికమైన పురాణేతి హాసిక కథాంశాలే ప్రధానంగా ఆ గేయ నాటికలకు కవితా వస్తువులైనాయి. భారతీయ సాహిత్యంలో గురుదేవులు రవీంద్ర కవీంద్రులు గేయరూపక ప్రక్రియకు పునరుజ్జీవనం కల్పించిన పూజ్యపాదులు. ప్రతిభామయులైన కొందరు ఆధునిక తెలుగు కవులు ముఖ్యంగా కళాప్రపూర్ణులు డా॥ బోయి భీమన్న, డా॥ సి. నారాయణ రెడ్డి సృజనాత్మక చారిత్రక జీవితేతి వృత్తాలతో అనేక గేయ నాటికలు రచించి నృత్య గేయ నాటికా సాహిత్యంలో ఒక క్రొత్త మలుపు తీసుకొచ్చారు. నారాయణరెడ్డి గారి నవ్వని పువ్వు, వెన్నెలవాడ, అజంతా సుందరి, వంటి సంగీత రూపకాలు, భీమన్నగారి పైరు పాట, మానవుని మరొకమజిలి, చిత్రకళా ప్రదర్శన వంటి గేయనాటికలు క్రొత్త పరిణామానికి మచ్చుతునకలు. విశ్వనాథ వారి 'కిన్నెరసాని' కూడా ఈ కాల్పనిక సంగీత రూపక సాహిత్య ప్రక్రియకు వన్నె పెట్టినది. శివశంకర శాస్త్రి 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' వంటి గేయ రూపకాలు సంగీత సాహిత్యాల సమన్వయాన్ని సాధించి ఈ ప్రక్రియలో ప్రశంసనీయమైన క్రొత్త ఒరవడి దిద్దినది.

నేను తొలిసారి వ్రాసిన గేయ రూపకం 'రాకెట్టు రాయబారం'. అది 1960 ప్రాంతంలో ఆధునిక శాస్త్ర విజ్ఞాన విహాయస వీధుల్లో రెక్కలార్చిన ప్రగతిశీల భావ విహంగం. పూజ్యులు మల్లంపల్లి సోమశేఖరశర్మ వంటి విమర్శకుల మన్ననలందిన ఆ గేయనాటిక చరిత్రాత్మకమై సృజనాత్మక సాహిత్య కళా ఖండంగా గుర్తింపబడి చరితార్థమైంది. ఆ తర్వాత 1964 ప్రాంతంలో విశాఖ పట్టణంలో మిత్రులు డా॥ డి. కృష్ణమూర్తి గారి ప్రోద్బలంతో "ఋతురాగం" అనే గేయనాటిక వ్రాయడంతో గేయనాటికా రచనలో నాకూ ఒక స్థానం ఏర్పడింది. అప్పటి నుండి నేను అలవోకగా వ్రాసిన గేయ నాటికలో 'సాగరసౌధం', 'భావి జీవులు',"చాచా నెహ్రూ","విజయహేల""ప్రజావిజయం"వంటివి కొన్ని బహుళ ప్రచారం చెందాయి. 1976లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల్లో"సాగరసౌధం" ప్రదర్శించిన నాగార్జునసాగర్‌లోని "గౌతమబాల విహార్" కళాకారులు ప్రశంసా పాత్రులైనారు. వారు ఆ నాటి నుండి ఆ నాటికను భారతదేమంతటా తెలుగు వారి ఒక ఉత్తమ కళాఖండంగా ప్రదర్శిస్తూనే ఉన్నారు.

అట్లాగే "ఋతురాగం" డా॥ డి. కృష్ణమూర్తి ( డిక్కీ ) గారి సంగీత నేతృత్వంలో తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర సాంస్కృతిక సంస్థ కేంద్రంగా దేశ

విదేశ ప్రేక్షకుల సమక్షంలో ప్రదర్శింపబడి అంతర్జాతీయ కీర్తి నార్జించింది. ప్రఖ్యాత సంగీత సామ్రాజ్ఞి శ్రీమతి శోభారాణి ఆ నాటికలోని కొన్ని గీతాలు ఆలపించి దానికి ఒక క్రొత్త వెలుగు అందించారు. పాలగుమ్మి విశ్వనాథం, యం. చిత్తరంజన్, యం. నరసింహమూర్తివంటి విఖ్యాత సంగీత కళాకోవిదుల ప్రావీణ్యస్పర్శలో, ఆకాశవాణి, దూరదర్శిని వేదికలపై ఈ నాటికలు కొన్ని విప్లవాత్మక కళానుభూతి పండించాయి.

ఈ సంపుటిలో క్రొత్తగా చేర్చిన ఆరు గేయనాటికల్లో రెండు 'వచనగేయ నాటికలు'-పిల్లలమర్రితో ఇంటర్వ్యూ, చేతనా కేతనం - సంగీత ప్రధానమైనవి కాక పోయిగా ప్రదర్శనయోగ్యమైనవి.లయాత్మకమైన కళాత్మకమైన ఈనాటికలు రూపక ప్రక్రియకు ఒక విశిష్టతను చేకూర్చగలవని ఆశిస్తున్నాను. ప్రయోగాత్మక ప్రయోజ నాత్మకమైన ఈ నృత్య నాటికలన్నీ డా॥ బోయి భీమన్న, డా॥ దాశరథి, డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు, డా॥ మంగళగిరి ప్రమీలాదేవి, డా॥ చేకూరి రామారావు, డా॥ తిరుమల శ్రీనివాసాచార్య వంటి సాహిత్య బంధువుల సాహిత్య విమర్శల తూలనాత్మక, పరిశీలనాత్మక, పరిశోధనాత్మక సమీక్షలకు పాత్ర మైనవి - వారందరికీ నేను ఈ సందర్భంలో కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. అభిజ్ఞుల అభిప్రాయాలు కొన్ని ఈ పుస్తకంలో ఉటంకించబడ్డాయి.

కళాభిమానులు, అభ్యుదయ శీలురైన తెలుగు ప్రజల ఆదరాభిమానాలతో ఈ గేయనాటికలు మూడవ ముద్రణకు నోచుకోవటం నా అదృష్టం. ప్రతి ముద్రణ విస్తృత ముద్రణగా వెలువటం కూడా పుస్తకంలోని క్రొత్తదనాన్ని, ప్రగతి శీలాన్ని సూచిస్తున్నవి.

నా గేయఖండికలన్నీ మూడు సంపుటాలుగా ఈ మధ్యే ప్రచురింపబడ్డాయి. ప్రతి సంపుటి ఒక ప్రత్యేక భావధారాగతమైనది. "శ్రీకార శిఖరం" ప్రణవాత్మక ఆధ్యాత్మిక చింతనాపరమైన గీతికా సంపుటి. "ప్రేమారామం" ప్రణయతత్వ శృంగార రసోన్ముఖియైన గేయస్రోతస్విని. ఇక సామాజిక ఆర్థిక పరమైన ప్రగతి నాదాలు శ్రుతించే జీవనధార "నాదేశం నవ్వుతూంది" గా రూపొందింది. ఈ మూడు గేయ సంపుటాలు మానవ జీవితాన్ని ప్రతిబింబించే త్రివర్ణచేతనాకేతనం. మానవుని ప్రణయ ప్రణవ ప్రగతి భావచేతనం ఈ త్రివర్ణకేతనం. భిన్నభిన్నంగా కనిపించే ఈ త్రివిధాలోచనా అనుభూతి పథాలు మనిషిని చేర్చే గమ్యం ఒకటే. వాటి సమన్వయమే. సహజీవనమే ఆనందమయ జీవితారామం. ఏ చిత్త వృత్తిలో మనిషి విహరించినా ఈ లోకంలోనే నాకాన్ని తీర్చే, సర్వమానవ సమతా సౌందర్య దర్శనాన్ని కూర్చే సత్యాలను, విశ్వాసాలను, విలువలను ఆవిష్క రించాలి. అలాంటి సత్య సౌందర్య పూర్ణానంద జీవన దర్శనమే నా సాహిత్యా దర్శం. తదాదర్శపుటి నా ప్రతి గేయ సంపుటి.

నా వచన కవితలు కూడా అలాగే ప్రత్యేక భావధారాగతమైన మూడు గ్రంథాలుగా వెలువడుతున్నాయి. "అనంత సత్యాలు", ఆత్మచేత నాజ్యోతులైతే, "మనచేతుల్లోనే ఉంది" సమతా జీవన సమాజ శక్తి సాధనమైంది. మరో వచన కావ్య సంపుటి ప్రణయ భావ ప్రభాకరమై త్వరలోనే ప్రజ్వరిల్లనున్నది. అయితే "గేయ నాటికలు" నా "పద్యకావ్యాలు" ఈ త్రయీనాథ సమ్మిశితంగానే ప్రచురితమైనాయి ముందు ముందు అవి కూడా త్రివేణులుగా ప్రవహించి సమగ్ర సమన్వయ సంపూర్ణ మానవ జీవితార్ణవంగా పొంగులెత్తాలని ఆశిస్తున్నాను.

ఈ గేయనాటికలు కళాతపస్వి, చలనచిత్ర జగద్యశస్వి శ్రీ గుమ్మడి వేంకటేశ్వరరావుగారికి ఏనాడో 28-7-70 నాడే అంకితంచేశాను. ఆయన ప్రతిభా కీర్తి సంపదలవలెనే ఈ కావ్యయశము దినదిన ప్రవర్ధమానమై నేటికి నవోన్నత శిఖరాలు చేరుకున్నందుకు సంతోషిస్తున్నాను. సగర్వంగా, సగౌరవంగా ఆయనని అక్షరాల అభినందిస్తూ మూడవ విస్తృత ముద్రణతో ముస్తాబైన పుస్తకకన్యను ఆయనకు పునరంకితం చేస్తున్నాడు. నా సాహిత్య యాత్రలో అనవరతం తోడ్ప తున్న, ప్రోత్సాహ ప్రోద్బల దీప్తులు వెదజల్లుతున్న మిత్రకోటిని పేరుపేరున పేర్కొనలేక పోతున్నప్పటికీ కృతజ్ఞతా పూర్వక ఆత్మాభివందనం చేస్తున్నాను. డా॥ సి నారాయణరెడ్డి, డా॥ బోయి భీమన్న, డా॥ దాశరధి డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, శ్రీ దేవులపల్లి రామానుజరావు వంటి సాహిత్య మూర్తులను తదగణిత మిత్రకోటికి ప్రతీకలుగా స్మరిస్తూ సంతృప్తి పడుతున్నాను. ఈ నా సాహిత్య యజ్ఞానికి సహాయసహకారాలు అందిస్తున్న శ్రీ ఎ. వెంకటేశ్వరరావు వంటి స్నేహశీల సంపన్నులకు ప్రత్యేక ప్రశంసాత్మక కృతజ్ఞత లందిస్తున్నాను. ఈ నాటికలు రసజ్ఞ మానవహృదయ సీమలలో ఆనంద వాటికలై ఆడుకోవాలని, పాడు కోవాలని ఆకాంక్షిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని సుందరంగా ప్రచురించిన "జయంప్రచురణల" వారికి ముఖ్యంగా ఆ సంస్థ నిర్వాహకులు శ్రీ జె. మారుతిగారికి నా హృదయ పూర్వక ధన్యవాదాలు. ముచ్చటగా ఈ గ్రంథాన్ని ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, చక్కని ముఖచిత్రం తీర్చిన సాహిత్యబంధువు, చిత్రకళా సింధువు శ్రీ మడిపడగ బలరామాచార్యగారికి నా ప్రశంసాత్మక కృతజ్ఞతలు.

రాష్ట్ర విద్యాశాఖ డైరెక్టర్ తమ **L. Dis. No** 5493/**CA**2/70 **Dt.** 12-5-70లో. గ్రంథాలయ శాఖ డైరెక్టర్ తమ సైటేషన్ **No**. 1342/**CTVIB**/69లో, దేవాదాయశాఖ కమీషనర్ తమ **L. Dis No. J**3/27027/70లో ఈ పుస్తకాన్ని ఆయా గ్రంథాలయాలకోసం కమెండేషన్ చేశారు. వారికి కూడ నేను కృతజ్ఞుణ్ణి.

జె. బాపురెడ్డి

# ఋతురాగం

[కాల చక్రంలో ఆరు ఋతువులు ఆరు అరల (ఆకుల) వంటివి. ప్రతి ఋతువుకూ ప్రకృతి జీవన వీణా శ్రుతుల్లో, మానవ జీవితాను భూతుల్లో ప్రత్యేకమైన ప్రాముఖ్యం ఉన్నది. అయినా, ఋతుకాంతలు ఒకరిని మించి ఒకరు, ఒకగిని త్రోసుకొని ఒకరు జగద్రంగ స్థలం మీద విహారం చేస్తున్నట్లు భాసిస్తుంది. స్త్రీకి సహజంగా అన్యకాంతల పట్ల ఉండే ఈర్ష్యా ప్రవృత్తిని, జీవితంలోని సహజ సంఘర్షణలను, సమన్వయాలను కళాత్మకంగా చిత్రించడమే ఈగేయరూపకంలో చేసిన ప్రయత్నం. ఇందులో వర్షాసుందరి, శరద్బాల, హేమంతకాంత, శిశిరభామిని, వసంతకుమారి, గ్రీష్మరాగిణి, కాలపురుషుడు పాత్రలుగా వస్తారు.]

(అప్పుడు యథోచితంగా సిద్ధమైయున్న రంగస్థలంలోకి వర్షాసుందరి ప్రవేశిస్తుంది)

## వర్షాసుందరి :

కడలిలోని నీరు, మబ్బు
కడవలతో మోసి తెచ్చి
మండిపోవు పుడమి తల్లి
గుండె సేదతీర్చినాను

వర్షాసుందరి నేను
ఇల
కర్షకలోకానందము నేను.

జలజల గలగల ఆడుచు పాడుచు
చరాచరాలకు గిలిగింతల నిడు
నవజీవన సంధాయిని నేను
భువన భవన స్వేచ్ఛాప్రభ నేను.

ఆకసమ్ములో సింగిణు లవిగో
నాకు స్వాగత పతాకలు కట్టెను
మెరుపు కన్నెలు పులకితాంగలై
మురిపెముతో హారతులు పట్టెను. వర్షా॥

నా కనుచూపులు సోకిన ఎల్లెడ
నదీనదాలు నాట్యము చేయును
నా పదముద్రలు తాకిన నేలలు
నవీన సస్యశ్యామల సీమలు. వర్షా॥

మదీయ జీవన రాగములో, కల
మయూరబాలలు నాట్యము చేసె
మదీయ క్రీడా జలపాతాల
మహత్వ విద్యున్మాలలు పూచె. వర్షా॥

నేను లేనిచో లోక మంతయు
ప్రాణములేని ఎడారి సుమా!
నేను రానిచో మానవజాతికి
నిత్య నరక యాతనలె గదా! వర్షా॥

*(అంతలో శరద్బాల రంగంమీదికి వచ్చి, వర్షాసుందరి గొప్పలను అవహేళన చేస్తుంది.)*

శరద్బాల:

చాలు చాలు నీ గొప్పలు
చాలించవె వర్షాంగన!
నింగినుండి దిగివచ్చిన
నీరదాల రాణివటే?

ఎదు రెవ్వరు లేరనుకొని
ఏమేమో వాగుతావు
అంతా నేనే అనుచు
ఎంత మిడిసి పడితావు. చాలు॥

చీటిమాటి కలిగిపోయి
కాటకాలు తెస్తావు
వచ్చావో దేశమంత
వరదలు పారిస్తావు. చాలు॥

గంగా గోదావరులను
గల్లంతులు చేయలేదె?
నిండుబ్రతుకు లెన్నెన్నో
నీళ్ళపాలు చేయలేదె? చాలు॥

గుండె లన్ని నీరు చేయు
కొండ మబ్బు దండు లన్ని
కంపము కల్గించెడి నీ
శంపా సర్పా లన్నీ
పారిపోవు నవే నేను
పాద మ్మిడ జగతిలోన॥ చాలు॥

(అంతట వర్షాసుందరి కోపంతో ముందుకు పోయి, నిష్క్రమిస్తుంది. శరద్బాల తన ఘనత ప్రకటించు కొంటుంది.)

శరద్బాల :

అందాలకు రాణిని
అమృత విజయ వాణిని
దివినుండి దిగివచ్చిన
నవశారద లక్ష్మిని.

చల్లనైన వెన్నెల
చానపి చల్లాను
తెల్లనైన అంబుదాల
తెరలు కట్టినాను. అందా॥

వింతవింత చిరుగాలుల
వీవనలను వీచాను
లోకమెల్ల కళానంద
లోకములో తేల్చాను. అందా॥

నీటిలోని కలువలను
నింగిలోని నెలరాజును
వలపు కౌగిలింతలలో
మఱచిన ప్రణయాత్మ నేను. అందా॥

ఏటిగట్టు రెల్లుపూలు
ఏ మెరుగని పేదగుండె
విరిసె నవే నే కన్నులు
తెరచి నంతనే . అందా॥

నా రాకే లోకానికి
నవభావన నాకము
నా పాదే జనావళికి
దీపావళి పర్వము . అందా॥

*(అప్పుడు వెనక నుంచి హేమంతకాంత ప్రవేశించి, శరద్బాలపై విరుచుక పడుతుంది.)*

**హేమంత కాంత :**

వెన్నెల కోకలు కట్టగనే
వన్నెలాడివి కాలేదు
మబ్బుల దండలు పట్టగనే
మహియే స్వర్గము కాలేదు. వెన్నెల॥

నెలలో సగము నిశీధులలో
నీ వెన్నెల వీవన లేవీ?
దినమున సగమౌ పగ లంతా
కనపడవో శారద దేవీ! వెన్నెల॥

జల మింకిన నీ జలదాలు
కలిగించే సంబర మేమో?
గంధము కోల్పడి తుళ్ళెడి నీ
గంధవాహములు ఎందులకో? వెన్నెల॥

గర్వపడకు శారదరాణి?
కలదిట నిను మించిన దొరసాని,
వెడలి పొమ్ము నీ అర్థము లేని
వెఱ్ఱిమొఱ్ఱి వాదాలు మాని. వెన్నెల॥

*(అంతట తెల్లబోయి శరద్బాల నిష్క్రమిస్తుంది. ఆ పై హేమంతకాంత తన అతిశయాన్ని ఇలా ప్రకటించు కొంటుంది.)*

## హేమంత కాంత:

మంచు పైట, సవరించి ఆడు, నీ
మంతిని నే, హేమంతిని నేను!

హిమ బిందువుల,
మహీతల మెల్లెడ
చల్లిన చల్లని తల్లిని నేను-
పొలాలన్ని, పంటలు పండించిన
కాంతిని నే, సంక్రాంతిని నేను. మంచు॥

గుమ్మడి పూవుల గుండెలు విరిసెను
సెనగ పూవు చెలి సిగ్గులు వీడెను.
. నా చిరునవ్వుల రోచులలో!
నా చల చల్లని వీచులలో. మంచు॥

జవరాంద్రకు అటు
చెలికాంద్రకు ఇటు
ఎదలలోన వెచ్చదనము నిండెను—

గాఢ పరిష్వంగాలలో చిర,
కాలపు తీయని కల లవి పండెను
నా చలచల్లని వీచులలో
నా చిరునవ్వుల రోచులలో! మంచు॥

*(అప్పుడు శిశిరభామిని ప్రవేశించి, హేమంతకాంతను ఎదిరించి పలుకుతుంది.)*

## శిశిర భామిని:

ఎంత కర్కశ హృదయవే
నీవు హేమంతి?
ఇలను శీతలపు సంకెళుల బంధించితివి !

వయసు బరువున నడుము
వంగిన ముదుసళుల
ముసుగు మూటలలోన
ముద్ద గట్టించితివి. ఎంత॥

ఉభయ సంధ్యలు చలికి
ఉబ్బి తబ్బిబ్బాయె
పాప మంటని, పసి
పాప గజగజ లాడె. ఎంత॥

తొలగిపో, తొలగిపో
తలవంచుకొని నేడె
చలి రంపమున కుత్తు
కలు కోయుటలు మాని
తొలగిపో! నే సాగు
త్రోవ కడ్డము రాకు. ఎంత॥

(అప్పుడు హేమంత కాంత చకితురాలై నిష్క్రమిస్తుంది. శిశిర భామిని ఆడంబరాలు ప్రకటిస్తుంది.)

### శిశిర భామిని:

శిశిర బాలను శివ సుఖేలను
ప్రేమ భావము పెంచుదానను
మంచి యెడ తల వంచు దానను—

త్యాగ శీలము దయా ధర్మము
సహృదయత్వము శాంతి సహనము
వెన్నతోనే నాకు పెట్టిన విద్దెలు
ఎన్నటికి విడిపోని ఉన్నత బుద్ధులు. శిశిర॥

ఏమిటీ స్వాగతము
ఏమిటీ సన్మాన
మెందుకో నేనంటె
ఇంత అభిమానము
ఈ పేదవడిన వనలక్ష్మికి
జీర్ణమయ్యే
తరువు తరువు, లత లతకు ! శిశిర

కురిపించె నా మీద
వరదాయినీ వని
తనకుగల కలిమి సర్వస్వము
మిగిలిపోయిన
నాల్గు పసిడి పత్రములు ! శిశిర॥
నా బ్రతుకు వెచ్చించి
నలిగి పోయెడి ప్రకృతి
లో, చేతనము నించగలను
ఈధరణి
లో, కళల పోషించగలను. శిశిర॥

*(అప్పుడు వసంతకుమారి ప్రవేశించి, శిశిరబాలను నిరసించి పలుకుతుంది.)*

## వసంత కుమారి :

ఎందుకు ? ఎందుకు ? ఎందుకు ?
ఈ విలయ నాట్య మెందుకు ?
అందము చూచి సహించని దానా !
అనురాగాలు నశించిన దానా !
ఓ శైశిరమా ! విషకృపాణమా !

సన్మానా లని సాకులు చెప్పచు
సుగుణ రాశి నని సూక్తులు పలుకుచు
ఆటలు సాగిస్తా నను కోకు
అందరి నమ్మిస్తా ననుకోకు. ఎందుకు॥

అడవి పడతి మానధనం
దోచుకున్న దొంగ వీవు
అసురత్వం హాసంలో
దాచుకున్న జాణ వీవు–
కళలను వెలిగిస్తా నని
కథలు చెపితె నమ్మగలరె ?
పిల్లి పాలు పితుకు నంటె
పిల్లలైన నమ్మగలరె ? ఎందుకు॥

పారిపొమ్మ జారిపొమ్మ
దూర దిగంతాలు దాటి
ఈ భూతలి నీ చేతుల
లో బూడిద కాకముందె
పారిపొమ్మ, పారిపొమ్మ
ఈ దారిని తిరిగి రాకు ! ఎందుకు॥

*(అంతట శిశిరభామిని చల్లగా నిష్క్రమిస్తుంది. ఇక వసంత కుమారి తన వైభవాన్ని వర్ణిస్తుంది.)*

## వసంత కుమారి :

కోకిల పాటలు
పూవుల తోటలు
నేను నడచిన బాటలలో
నేను నిలిచిన చోటులలో

మామిడి ఫలములు
మధుకర రవములు
నేను తాకిన కొమ్మలలో
నేను ఊపిన రెమ్మలలో కోకిల॥

మోడుల
పువ్వుల మేడలు చేసితి
శిథిలాలకు
నవజీవము పోసితి
నా మధూహల రంగులతో
నా సుగాన సుధాధునితో. కోకిల॥

కొండలు ప్రాకితి
కొలనులు దూకితి
ప్రతి చెట్టును
ప్రతి లతికను చేరితి
బాధలను తొలగించుటకై
ఆశలను చిగురించుటకై కోకిల॥

కవితకు కళలకు
కారణ మైతిని
ఉగాది నైతిని
యుగాది నైతిని
ఊరూర ఇంటింటికిని
మనిషి మనిషి ప్రతి జీవికిని. కోకిల॥

నవతకు యువతకు
నవజీవిత
పరువమ్మును తెచ్చిన దేవిని నే—

నింగికి- నేలకు
నిర్మల చాంద్రీ
డోలలు కట్టిన బాలను నే— కోకిల॥

కన్నెల మనసుల
కమ్మని తలపుల
మల్లెలు నాటిన బోటిని నే—

అందమ్ముల
ఆనందమ్ముల,
జగమంతట పరచిన ఆమని నే. కోకిల॥

*(అప్పుడు గ్రీష్మరాగిణి ప్రవేశించి, వసంతాన్ని ధిక్కరించి పలుకుతుంది.)*

గ్రీష్మరాగిణి:

వాసంతమా! ఈ
విలాస మేలా?
విలాసమ్ములో ఇంత
మోస మేలా?

బాల పల్లవ ఖాదినీ
పికాలాపాల
వికచ పుష్ప పరాగ
మధుపాయి గానాల
మత్తిల్లి పోయె జగ మంత చూడు
మాయలో పడె ప్రకృతికాంత నేడు! వాసం॥

క్షేత్రాలలో
పంటచేలు లేవు
ఝురులలో
జలకాల జాడ లేదు

నవ రసా లోపవన
విజన కాంతారముల
గిరి శిఖాంతర
విహార వినోదివై నీవు
ఎవరికి సుఖాలు కలిగించినావే?
ఇకనైన వేట చాలించి పోవే ! వాసం॥

నా మహా కోప
తాపాగ్నిలో దగ్ధమై
పోకముందే, వెడలి
పో, కదలి పోవే ! వాసం॥

*(అంతట వసంతకుమారి హఠావిడిగా నిష్క్రమిస్తుంది. గ్రీష్మ రాగిణి ఔజ్జ్వల్యాన్ని ప్రకటించు కొంటుంది.)*

## గ్రీష్మరాగిణి :

వచ్చాను వచ్చాను
గ్రీష్మరాగిణి నేను.

శిరముపై చండ రవి
భాండము వహించి
శివుని ఫాలాగ్ని
కీలామాలలు ధరించి ! వచ్చాను॥

మత్త విశ్వంభరకు
ఉత్తేజకమునై
వేదనల విదలించు
విప్లవోషస్వినై ! వచ్చాను॥

ఇందరు ప్రపాంగనలు
ఇన్ని చలివేంద్రములు
నేను చెరగిన చంద్ర
నిప్పు లార్పగ లేవు ! వచ్చాను॥

అంబుధి హృదయమ్ము
ఆవిరై పై కెగసి
నా జగత్తున జీవ
నామృతమ్మై కురిసి

మట్టిలో భాగ్యాల
మణులు మేల్కొల్పాలి
అప్పుడే నాదు క్షుభి
తాత్మ శాంతిల్లాలి ! వచ్చాను॥

*(అప్పుడు ఈ ఋతుకాంతల పరస్పర సంఘర్షణలతో ఆకంపిత మైన రంగంమీదికి ఆందోళితుడై కాలపురుషుడు ప్రవేశిస్తాడు.)*

కాల పురుషుడు :

ఓహో ! షట్ ఋతువు లార !
నా హృదయ జ్యోతులార !

ఓ వర్ష మకుట రాణీ !
ఓ శారద చంద్రముఖీ !
ఓ హేమంత కామినీ !
ఓ శైశిర శాతోదరి !
ఓ వసంత కుసుమాంగి !
ఓ గ్రీష్మ జ్వాలాముఖి !

*(ఋతు కన్యలు ఒక్కొ రొక్కరే రంగం మీదికి తిరిగి వచ్చి, కాల పురుషుని పరివేష్టించి నిలబడతారు. కాలపురుషుడు తన సందేశం కొన సాగిస్తాడు....)*

మీలో మీరిట్లు హద్దు
మీరి పోరుపడకండి !
ఈ కాల పురుషుని బ్రతుకు
లో తుపాను రేపకండి ! ఓహో॥

లోకమునకు మీ రందరు
ఏకరీతి ప్రియతమలు
నా అనంత జీవన
గంగా చలత్తరంగాలు ! ఓహో॥

ఒకరు లేక ఒకరు లేరు
సకలము ఎవ్వరు కారు,
యుగయుగాలు నా వెంబడి
ప్రగతిని సాధించ రండి ! ఓహో॥

కలహమ్ములు మానండి !
కలసి మెలసి మెలగండి !
కలకాలము నాట్య గాన
కళలతోడ వెలగండి ! ఓహో॥

*(కాలపురుషుని చుట్టూ ఇప్పుడు ఆనందహాసన్ముఖులై ఋతుకాంతలు నృత్యం చేస్తూ బృందగానం చేస్తారు.)*

## బృందగానం :

ఋతు రాణులమూ
ప్రకృతి వీణలము
ఒకరి నొకరు ప్రేమించెదము
ఒకరివెంట ఒకరము భూగోళము
చుట్టు ముట్టి నర్తించెదము.

నవ రసమ్ములను
నవ చైతన్యము
ప్రాణి జగత్తుకు పంచెదము
కాలదేవునికి కన్నుల పండువగా
నిత్యము జీవించెదము .

# సాగర సౌధం

[వేలవేల వసంతాలుగా కృష్ణవేణి ప్రవహిస్తున్నది. ఎన్నో శతాబ్దాలు ఆమె కింకిణీ క్వాణంలో కరిగిపోయినవి. ఎన్నో సామ్రాజ్యాలు ఆమె పుణ్యతీరంలో వెలిసిపోయినవి. అయినా ఏనాడూ ఎవ్వరూ ఆమెకు ఉండటానికి ఒక ఇల్లైనా కట్టలేదు. నిలువ నీడలేని తాను ఎవరికీ సాయ పడలేక పోతున్నానని, తన సంపద అంతా అడవిగాసిన వెన్నెలై పోతున్నదని విలపిస్తుంది. ప్రజల పంచలో ఉండలేకపోతున్నా ననే వేదనతో కృష్ణమ్మ కన్నీటి కాలువై కడలి దారిపట్టింది

[స్వాతంత్ర్య కాంతి స్నాతులు, విజ్ఞాన విశేతలు, సాహసోపేతులు అయిన నేటి తెలుగు జనకోటి ఆమెకు మహా సౌధం కట్టడం, ఆమెకన్నీరును పన్నీరుగా మార్చడం ఈ నాటికలోని ఇతివృత్తం. యోగనిద్రా ముద్రనుండి నాగార్జునుడు ఈ సాగర సౌధ నిర్మాణానికి మూర్తం పెట్టి ముగ్గుపోయిస్తాడు.

[కృష్ణవేణి, ప్రజాశక్తి – నలుగురైదుగురు స్త్రీపురుష మూర్తులు – నాగార్జునుడు ఇందులో పాత్రలుగా వస్తారు. అక్కడక్కడ నేపథ్యకంఠం వినిపిస్తుంది.]

[యథోచితమైన రంగంలోకి కృష్ణవేణి ప్రవేశిస్తుంది. ఒక ప్రక్క యోగముద్రలో నాగార్జునుడు, మరొక ప్రక్క మౌనముద్రలో కొందరు ప్రజలు ఉంటారు ]

కృష్ణవేణి :

నిజమేనా ! నిజమేనా !
నేను కన్నకల నిజమేనా !

బాధామయమౌ నా చిరగాధ
పండువెన్నెలై విరిసేనా ?
రాలే నిండిన నా ఒడినిండ
రత్నరాసు లిక కురిసేనా ? నిజమేనా॥

ఎవ రాలించని నా వేదనలు
ఈ నా డందరు విన్నారా ?
ఎవ రూహించని నా శక్తులను
ఈనాటి ప్రజలు కన్నారా ? నిజమేనా॥

*(అప్పుడు నేపథ్యకంఠం వినివిస్తుంది. తదనుగుణంగా కృష్ణవేణి స్పందిస్తుంది.)*

## నేపథ్య కంఠం :

కన్నీరు తుడుచుకో
కృష్ణవేణీ ! నీ
కష్టాలు ఈడేరె నమ్మా !
నిజమేను, నిజముగానే
నీ కలలు పండె
విజయహాసము చిందు మమ్మా!:

అడవి పాలైన నీ అందాలబ్రతు కింక
ఆరాధనీయమౌ నమ్మా!
కడలి పాలైన నీ సంసార సంపదలు
కనకంపు కోటలౌ నమ్మా! కన్నీరు॥

వినుము, విస్మృత చరిత్రము లేచి నాగార్జు
నుని గళమ్మున మ్రోగె నిదిగో!
విను, ప్రజాతంత్ర స్వతంత్రతా కాహళులు
వీర జన కంఠాల నదిగో! కన్నీరు॥

*(అప్పుడు నాగార్జునుడు యోగనిద్రనుంచి మేల్కొంటూ)*

**నాగార్జునుడు:**

ఎవరో నను లేపినారు
ఎడతెగని నిదుర నుండి

విధియే పడద్రోసి చనిన
శిధిలాలను కదిలించి
నా దట్టపు చీకటి గది
లో, దీపము వెలిగించి— ఎవరో॥

కలిపి, అమర త్రిశరణార్థి
గానము కృష్ణా గళమున
నిదురపోతి, నే నీ
నిర్నిద్ర బౌద్ధ విహారమున ఎవరో॥

ఆ నాటి విజయపురిని
ఆ నాటి కళాలయమును
విజ్ఞానధనులు పున
రావిష్కరించెదరు ఎవరో ఎవరో॥

*(నాగార్జునుడు అర్ధనిమీలితనేత్రుడై కూర్చుని ఉంటాడు. ఉదాసీనంగా ఉన్న ప్రజలు చైతన్యవంతులై లేస్తారు.)*

**ప్రజాశక్తి:**

తల్లీ! కృష్ణానదీ వతల్లీ!
తరగని బాధా తరంగ వల్లి!

సుందరదేశ చరిత్ర
శక్తి గర్భమున పుట్టి
పథములేని దేదో మహా
ప్రస్థానము తలపెట్టిన తల్లీ॥

నీ దారిని అడ్డిన
భూ ధరాల చీల్చినావు
కోనల లోయల బడి, కో
కోయని మము పిల్చినావు తల్లీ॥

సెలయే ళ్ళిడినట్టి జలాం
జలులు స్వీకరించి నావు
గ్రీష్మాంగన కోపానల
కీలలు భరియించినావు తల్లీ॥

అందినంత వరకు జీవ
మందించితి వెందరికో
ఎటు తోచక నీవే
పోయితి వే సాగరమునకో తల్లీ॥

## కృష్ణ వేణి :

ఆహా ! ఎన్నాళ్ళకు, ఈ
అమృతవాణి విననాయెను
అపుడే నా కనులలోని
అశ్రుజలము విడిపోయెను

ఎవరో మీ రెవరో నా
ఎద ఎదను కదల్చినారు
ఇంత చల్లగా, నా సుతు
లేనా నను పిల్చినారు ఆహా॥

నిలువ నీడ లేని నాకు
విలువ ఏమి, చలువ ఏమి ?
చేరదీయ నపు డెవ్వరు
చింతించుటగాక ఏమి ? ఆహా॥

కష్టాలను నష్టాలను
కవిత లల్లు కొన్నాను
కలల అలలలో తేలుచు
కాలము వెలిబుచ్చినాను ఆహా॥

ప్రజాశక్తి :

స్వతంత్ర భారత
ప్రభాత కాంతి
చ్ఛటా స్నాతులం
శాంతి దూతలం

నేలలు దున్నేడి
హాలికులం,
ప్రగతీ లతికా
పరిపాలకులం
దారిద్ర్య పిశాచీ రిపులం
సమతా జీవన జ్యోతి శ్శిఖలం స్వతంత్ర॥

శ్రమ ఘర్మ జల సముద్రాల
నవ సమాజ నౌకా చోదకులం
త్వదీయ హాస ప్రదీప్తి తో
మము దీవించు
మనే ప్రజలం స్వతంత్ర॥

## కృష్ణ వేణి :

ఎంద రెందరు రాజులు
ఎన్నెన్ని సామ్రాజ్యమ్ములు
కాల దేవుని విలయ చితిలో
కాలినవి కాష్ఠమ్ములై

ఎన్ని ఎన్నో సంస్కృతులు
ఎన్నెన్నియో నాగరికతల్
భిన్నమై విచ్ఛిన్నమై అయి
యున్నవి పురాతన కథల్ ఎందరెంద॥

కాని ఎవ్వరు నాకు గృహమును
కట్టుటే తలపెట్ట లేదు
వారు సుఖపడలేదు పో నా
వలన, నను సుఖపెట్టలేదు ఎందరెంద॥

కరువు కాటకములను పసుల
మరణములను కని ఏడ్చినాను
ఎవరికిని కొరగాని నా బ్రతు
కెటెలో ఒక్కటు లీడ్చినాను ఎందరెంద॥

## ప్రజాశక్తి :

అవు నమ్మా ! అవు నమ్మా !
అన్యాయము జరిగినది
కినియకు, ఆ వెనుకకు
జరిగిన దేదో జరిగినది

బలులు శాతవాహనులు
ఇలాధిపులు ఇక్ష్వాకులు
నీ శక్తి గ్రహించలేక పోయిరో !
ధీ శక్తియె చాల కూరకుండిరో ! అవు॥

తర తరాలు తరిగి పోయె
చరిత్ర కడు కరిగి పోయె
నీ చిద్గీతా సంగీతాలలో
నీ పదముద్రా సంకేతాలలో అవు॥

రాజులు, రారాజులు
అబ్దాలు శతాబ్దాలు ఏలి
చేయలేని కార్యమ్మును
చేతుము నీ కొరకై
మోయలేని భారమ్ములు
మోతుము మా కొరకై అవు॥

## నాగార్జునుడు :

విన్నాను, విన్నాను
విప్లవపు పాట !
వీర ప్రజాకోటి !
వింటి మీ నోట !

వేవే వసంతాలు
విర బూయు తోట
రాలే గగుర్చి
రత్నాలైన బాట
కృష్ణ వేణమ్మ
కోర్కెల పసిడి కోట
నిర్మింపగా మీరు
నిలచు టీ పూట— విన్నాను॥

చాలు ఈ ఒక మాట
శ్రవణ పేయమ్ము

క్షణమె ఈ రోజు
అక్షర శతాబ్దమ్ము
నను ఏల మేల్కొల్పిరను
సంశయమును
తీర్చె మీ నిర్మాణ
దీక్షాశయమ్ము విన్నాను॥

## ప్రజాశక్తి :

అపర బుద్ధావతార !
బౌద్ధ
సంఘారామ స్థల విహారా !

క్షమియించు, కోరి నిను
కదలించి లేపితిమి
వెలుగు పూయని కాల
వృక్షమును ఊపితిమి ! అపర॥

సూర్య చంద్రులకైన
చూడ చోద్యమ్మైన
జల సౌధమును మహో
జ్జ్వల సౌధమును కట్ట
నడుములు బిగించితిమి
నాగార్జునాచార్య ! అపర॥

ముగ్గు రయ్యాలు మెచ్చ
మూర్తమ్ము పెట్టుమా
మూల కంభమునకై
నేల చూపెట్టుమా

నీ కన్న పండితుడు
మా కెవ్వ రాచార్య !
వేగ సెల వీయు మో
నాగార్జునాచార్య ! అపర॥

## నాగార్జునుడు :

ఈ శుభోదయ వేళకన్న
ఈ నవోదయ వేళకన్న
ఏకతా శస్త్రమును మీరు
చేకొనిన ఈ వేళ కన్న
లేదు వేరే మూర్త మన్నది
లేదు వేరె యధార్థ మన్నది
మాతృభారతవాటి పూచిన
ఓ తెలుంగు ప్రజాకోటి !

త్రిశరణాలు ప్రతిధ్వనించెడి
దీన జనతా ర్తి నినదించెడి
పురము లెన్నో వెలుగు చిందిన
మునిగణమ్ములు ముక్తి పొందిన
నందికొండల లోయలో
అందముల ఈ నేలలో
ముగ్గు నిపుడే పోయ రండి
మూల కంభము నెత్త లెండి—

మీరు కృష్ణకు కట్టదలచిన
మేడపై ఆ కొండమీద
అసదృశమగు బౌద్ధశిల్ప క
ళాలయమును కట్ట లెండీ !

అదృశ్యత నే నహర్నిశలును
అచట వెలసి తరింతునండీ
సెలవు నాకిక, కృష్ణవేణీ
స్వప్న సాగర మౌదునండీ—

*(నాగార్జునుడు అదృశ్యుడై పోతాడు. కృష్ణవేణి కనుమరుగై పోతుంది. భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ వేదిక మీద కనిపిస్తాడు.)*

## నేపథ్య కంఠం :

అదె స్వతంత్ర విహాయస విహారి జవహరుడు
ఎగసి వచ్చెను ఎత్తైమూల కంభము నదే!

"ఇది మీరు వెలిగించిన దీపం
ఇది కోటికోటి కలలకు రూపం''

అని మ్రోగె నదె ప్రజాగళ శంఖం
విని, పొంగు లెత్తె నెహ్రూ అంతరంగం.

*(అప్పుడు సాగర సౌధనిర్మాణ సరంభంలో ప్రజాశక్తి విజృంభిస్తుంది)*

## ప్రజా శక్తి :

రండీ! రారండి వెలుగు
జండా ఎగరేయండీ¡
కృష్ణమ్మ ఎద నిండే
ఖిల్లా నిర్మించండీ!!

బండ నెత్తుకొని రండి
బంగార మదే నండి?
సుత్తెలు మ్రోగించండి
సుర దుందుభు లెందుకండి! రండీ॥

యంత్రాలను వాడండి
ఎముకల బిగి చూపండి
హాలాహలముల నుండే
అమృతములు పిండండీ ! రండీ॥

పాతాళ మ్మంటు దాక
పునాదులను త్రవ్వండి !
ఆకాశము నంటుదాకా
ప్రాకారము కట్టండి ! రండీ॥

కంటకాల నెట్టి పాల
కాలువలను పెట్టండి !
సాగరాల కొట్టి జీవ
సాగరాలు కట్టండి ! రండీ॥

*(కృష్ణవేణి తిరిగి రంగంలో ప్రవేశించి సంపూర్ణమైన సాగర సౌధాన్ని చూచి)*

## కృష్ణ వేణి :

ఆహా ! ఆహా ! ఎంతటి
అమరపురాలయ మిది !
విద్యావిజ్ఞాన శక్తి
విజయ పురాంగణ మిది !

నే కన్న కలకన్న
నేత్ర పర్వ మిది
నేలకును నింగికిని
నిండు గర్వ మిది ! ఆహా॥

ఆ కొండ పై నేమి
వైకుంఠమా అది !
ఈ లోయ దరి నేమి
కైలాసమా ఇది ! ఆహా॥

ఏదీ బౌద్ధారామము ?
ఏడీ నాగార్జునుడు?
ఓహో! ఆ కొండమీద
ఉన్నారా?
కొండమీద నేమిటి నా
గుండెలోనె ఉన్నారే ? ఆహా॥

చిత్ర చిత్రమైన ప్రకృతి
చిత్రాలే దిశల యందు
మయసభ ఏమాత్రము, ఈ
మహిమా భవనము ముందు ? ఆహా॥

ప్రజా శ క్తి :

నీ ఆశలు, ఆశయములు
నిండిన సాగర మిదే !
రాగ రసానంద సుధా
సాగర సౌధ మ్మిదే !

సేవలకై నీ ముంగిట
నావలు నియమించాము
ఆటలకై పాటలకై
తోటలు వేయించాము ! నీ ఆశలు॥

నీ నవజీవన శోభలు
నీ నవభావన రూపులు
చూడవచ్చినా రదిగో
సుందరతా పిపాసువులు ! నీ ఆశలు॥

నీ మహిమలు నీ మమతలు
ప్రేమతోడ చిత్రించెడి
కవులు, క్రాంతి కాముకులు
కళాకారు లల్లరుగో ! నీ ఆశలు॥

కృష్ణ వేణి :

ఏదారి చూచినా
కేదారమే !
ఏ మోడు తాకినా
పూమేడయే !

నా చూపు లెటు ప్రాకినా
పచ్చలే !
నా అందె లెట మ్రోగినా
అందమే ! ఏదారి॥

నా పాట ప్రవహించె నా
కాల్వలై !
నా ఆట దీపించెనా
కాంతులై ! ఏదారి॥

పల్లెలకు పేటలకు
ఢిల్లీ దాకా
నా కీర్తి నా వార్త
ప్రాకినదిగా— ఏదారి॥

నాగార్జునుని మంత్ర
యోగ బలమో ?
నా గవేషణ ధర్మ
యాగ ఫలమో ?
తీరె నా వెత లన్ని
తీరె ఈ దినము
తీరిచెద వీర ప్రజలార !
మీ ఋణము— ఏదారి॥

*(అంతట ప్రజావాహిని కృష్ణవేణిచుట్టు తిరుగుతూ బృందగానం చేస్తుంది)*

## బృంద గానం :

జయ జయ సాగర సదనా
జయ విద్యుత్ స్మితవదనా
జయ ధ్రువతారా రదనా
జయ కృష్ణాంబుద కేతన
జయ తెలుగు ధరా భూషణ
జయ భారత జన పోషణ
జయ దరిద్రతా భీషణ
జయ ప్రజా విజయ ఘోషణ ! జయ॥

# భావిజీవులు

["పుట్టిన వాళ్ళందరినీ పోషిస్తాడు పరమాత్ముడు" అన్నది పురాణ శాస్త్ర ధర్మం. "బ్రతుకు బాట లేని వాణ్ని భగవంతుడైనా పుట్టించకూడదు" అన్నదే ఆధునిక విజ్ఞాన శాస్త్ర ధర్మం. జీవులు పుట్టిన తర్వాతే వారి జీవనోపాధికై యోచించడం పురాతనాచారం. జీవనోపాధులు ఉంటేనే జీవులు పుట్టాలనటం నేటి కుటుంబ నియంత్రణ నీతిసారం. పుట్టిన వాళ్ళకు ఆధారం దేశ కాలాలు. ఆ దేశ కాలాలు కని పెంచే వాళ్ళ పక్షాన తమ బాధ్యతను గుర్తించి భావిజీవులతో సంభాషించటం ఈ గేయ నాటికలోని ఇతివృత్తం.

ఇందులో దేశ కాలాలు ఒక పక్షంగా, భావి జీవులు మరో పక్షంగా పాత్రలు కల్పించబడినాయి. దేశ కాలాలలో ఒకరు స్త్రీ, మరొకరు పురుషుడు. వారిని తలిదండ్రులు అనవచ్చు. ఆది దంపతు లనవచ్చు. భావి జీవులలో కొందరు స్త్రీలు. కొందరు పురుషులు. సంఖ్య ఎంతైనా ఉండవచ్చు.]

(నాటిక ఆదిలోను, అంతంలోను నేపథ్యవాణి వినిపిస్తుంది.)

## నేపథ్య వాణి :

ఎడతెగని ఘర్షణల
పుడమి రంగము మీద
వినిపించు ఈనాడు
వింత గొంతుక లేవా ?

భూ నభమ్ముల మధ్య
దృష్టాదృష్టము మధ్య
వెలుగు చీకటి మధ్య
కలహమో యనిపించు !

దేశ కాలముల,
సందేశ మాలించి,
సందేహాలు ప్రకటించు
దేహ రహితాత్మ లవె !

చంద్రగోళము మీద
ఇంద్రత్వమును గొనెడి
మానవుని భావి
సంతా నార్త రవ మదే !
దేశ కాలాల
ఉపదేశాలు విను మదే !

*(దేశ కాలాలు రంగం మీదికి ప్రవేశిస్తారు. భావి జీవులు అప్పటికే రంగం మీద అక్కడక్కడ ఒదిగి పండుకొని ఉంటారు.)*

దేశ కాలాలు :

ఆది ఎరుగని
అంత మెరుగని
దేశ కాలము లండి మేము
పుట్టి గిట్టే
గిట్టి పుట్టే
జీవులకు రక్షణము మేము—

యుగ యుగాలు
యుద్ధ శాంతులు
వచ్చి పోవుట చూచినాము
భావి జీవుల్లార
మీ కొరక
మేలు చేయగ నిలిచినాము ఆది॥

విశ్వ వీధుల వెలసి నట్టి
భూతలము మీ కేమొ ప్రియము
మీకు వలసిన మేటి వసతులు
చూపలే మని మాకు భయము ఆది॥

పుట్ట దలచిన
జీవులారా !
పెట్టుకొండి ప్రవేశ పత్రము
అనవసరముగ
జనన మొందిన
అవును మీ బ్రతు కేమొ సత్రము : ఆది॥

*(అప్పుడు తెల్లటి ఛాయామాత్ర వేషాలతో ఉన్న భావి జీవులు మెల్లమెల్లగా లేస్తారు.)*

## భావి జీవులు :

అలా అనే దెవ రది ?
ఆకాశ వాణిలా
భావిని రూపించ నెంచు
ప్రణాళికల రాణిలా

బయలు దేర నున్న మమ్మ
పట్టి ఆపుదు రెట్లు
గళము జారకుండ హరుడు
గరళము బిగబట్టి నట్లు అలా॥

## దేశ కాలాలు :

మేమే ! చెప్పితిమి గదా
మీ హితైషులం
కానరాని సత్యము గను
కవిదృశ ఋషులం

ఒకరిని దేశం అనండి
ఒకరిని కాలం అనండి
వాదించక మా ఈ ప్రతి
పాదన ఒప్పుకొనండి !

## భావి జీవులు :

చిత్రముగా లేవా మీ
చేసే బోధన లన్నీ ?
కోపపడక వినండి ఈ
పాపల వినతులు కొన్ని !

ఎవరికొరకు ఎందుకొరకు
ఈ మహోపదేశాలు
ఉన్నయ్యలకై లేని
పిన్నల ఉపవాసాలు ? చిత్రము॥

పుట్టిన ప్రతి మనిషి కొరకె
పుట్టె సకల శాస్త్రాలు
పుట్టించెద రేలా మరి
పుట్టుకకే సూత్రాలు చిత్రము॥

అయినా మీ రిచ్చేది ఆ
అద్భుతోపదేశ మేమొ ?
అందరిలా పుట్టకుండ
ఆపగ కారణ మేమొ ? చిత్రము॥

## దేశ కాలాలు :

అల్ప పీడనము వైపే
అనిలము వీచుగదా !
నేల పల్లమున్న వైపె
నీరు పారును గదా !
బాధ నుంచి మోదానికి
బ్రతుకు సాగిపోవలదా ?

ఏ బాధలు లేకుండా
ఎచటో ఉన్నారు మీరు
శాంతి సమాధులలో
నిశ్చల ధ్యానాత్మలు మీరు
అంతకన్న సౌఖ్యమున్న
యపుడె ఇలకు రా తగదా ! అల్ప॥

ఈతి బాధల జగత్తిది
ఇంత పడిగ రా నేల ?
భాజకమును పెంచి, భాగ
ఫలమును తగ్గించు వేల ? అల్ప॥

పుట్టబోవు ముందు నీ
తోబుట్టువు లెందరో చూడు
ఈ వరకే ఇద్ద రుంటె
ఆ వంకే చనుట కీడు అల్ప॥

ఉన్న ఆస్తి యెంతో నీ
కున్న భాగమెంతొ చూడు
తిండి గుడ్డలును కోర్కెలు
తీర్చ గలుగు నేమొ చూడు అల్ప॥

## భావి జీవులు :

పుట్టిన వాళ్ళందరినీ
పోషించును పరమాత్ముడు
అని అన్నాడు గదా ప్రతి మహాత్ముడు
అది కాదనువాడు కాడ పాపాత్ముడు ?

## దేశ కాలాలు :

కాల మనే పాల కడలిలో
దేశ మనే భూమిక మీద
'కృషి' యను కవ్వమును త్రిప్పగా
వెలువడేటి అమృతము గోరంత
విరగబడే వైరిజనం కొండంత.

కూటికోస మెన్ని ఎన్ని క్వ్యూలు
గూటికోస మెన్ని ఎన్ని క్వ్యూలు
క్వ్యూల వ్యూహములలోపల చిక్కిన
అభిమన్యుల నే దేవుడు రక్షించు ?
అదను కోసమై కాస్త నిరీక్షించు ! కాల॥

వేదాలు పురాణా లే మన్నా
వాదాలు వివాదా లెట్లున్నా
మొహమాటపడక చెప్పా లంటే
దేవుని దినసరి లెక్కల కంతు చిక్కకుండ
జీవుల సంఖ్యేమొ పెరుగుతుంది నేల నిండ ! కాల॥

## భావి జీవులు :

క్రొత్త దారులు వెతుకుతాము
మాకు మేమే బ్రతుకుతాము
ఎవరి సంతానమై మేము పుట్టినా
ఎవరి ఇంట మేము కాలు పెట్టినా

ఇలాగోళం చాలకుంటే
ఇందుగోళం చేరుతాం
ఏమి పండని ఎడారైనా
సాగుచేసే తీరుతాం క్రొత్త॥

కళ్ళు మూసుక కాళ్ళు ముడుచుక
కదలకుండా ఉండలేము
కష్టమో సుఖమో మానవ
జన్మమెత్తక ఉండలేము క్రొత్త॥

కన్నవారిని పెంచుకొనుటకు
కష్టపడుట ఏమి తప్పు ?
కనక—భూలోకమున మమ్ముల
కనక యుండుట ఏమి ఒప్పు ? క్రొత్త॥

## దేశ కాలాలు :

మీలో ఉత్సాహ మెంత ఉన్నా
మేదిని సాధనములు పరిమితమే,
గాలి లేక నీరు లేక మనునా
గరుడుడైన, తిమింగల మైనా ?

మోయలేని బరు వెత్తుకోవటం
తమను తామె వంచించుకోవటం,
వనరు లేని సంతానము కనటం
తమను తామె శపియించు కోవటం.

యుక్తికి మించిన కోరిక లుంటే
శక్తికి మించిన సంతతి కంటే
జీవిత మైపోవును ఒక పెంటే
జీవులార ! మే లిది ఎరిగుంటే.

## భావి జీవులు :

పుట్టిన వా ళ్ళందరిలా
పుట్టదలచు కొనువాళ్ళను
పుట్టకూడదనే వింత తత్వం

ఎక్కిన వా ళ్ళందరిలా
ఎక్కదలచు కొన్న వాళ్ళ
ఎక్కకుండ తలుపు వేయు
రైలు ప్రయాణికుల మనస్తత్వం !

## దేశ కాలాలు :

చో టున్నా లే కున్నా
చొరబడి మూడవ తరగతి
పెట్టెల్లో, యమయాతన
పడవ ద్దంటున్నాము.

సీట్లు నిర్ణయం చేసిన
స్లీపరు కోచీ లోనికి
ప్రవేశించి సుఖాత్ములై
ప్రయాణించు మంటున్నాము.

పుట్టిన వాళ్ళను, ముందు
పుట్టబోవు మిమ్ముకను సుఖ
పెట్టా లని, వెలుగు పంచి
పెట్టా లని మా యత్నం.

### భావి జీవులు :

ఇంతకూ మీ రనే దేమిటి ?
కొంతకాలం మమ్ము ఆగుమంటారా ?
బ్రతుకు బాటల రద్ది మాన్పుచు
ప్రవేశోత్తరువులను మా కిస్తుంటారా ?

### దేశ కాలాలు :

భారత దేశానికి
వారసు లయ్యేవారు
మానవతా సంస్కృతికి
ప్రాణముపోసే మీరు
కూడు గుడ్డయును లేని
కూలివాళ్ళు కారాదు
విద్యా భాగ్య విహీన ని
రుద్యోగులు కారాదు— భారత॥

రెక్కలు లేని పక్షుల
రీతి పుట్టి మనుట కన్న
మీ రిప్పుడు వేచియున్న
మీలితాత్మ గతి మిన్న

సౌభాగ్యము ఆరోగ్యము
సంతృప్తిగ పొందలేని
సంతానముగా పుట్టుట
చావకముందే గిట్టుట భారత॥

ఇంటింటికి ఇద్దరు లే
కుంటే ముగ్గురు పిల్లలు
చాలు చాలు అని అందుకె
గోల పెట్టి చెపుతుంటిమి

పుట్టుటకై మీరందరు
పెట్టు కొనే దరఖాస్తులు
చాల పరీక్షించి జనన
కాలము నిర్ణయిస్తాము భారత॥

## నేపథ్య వాణి :

ఘర్షణలో నుంచే
సంఘర్షణలో నుంచే
వర్షించును సత్యామృత
వర్షము, నవ్యాదర్శము-

తప్పు ఏదొ ఒప్పు ఏదొ
తర్కించిన తెలియుగదా !
పెద్ద లెవరొ పిన్నలెవరొ
బుద్ధి నిర్ణయించుగదా ఘర్ష॥

ఆతిథ్యము ఉన్నప్పుడు
అతిథులు వచ్చుట ధర్మం
జాతక బల మున్నప్పుడె
జన్మించుట నవ ధర్మం ఘర్ష॥

దేశకాలములు చూపిన
ధ్యేయమ్మును పాటించి
పుట్టిన జీవుల కేమొ
పుడమి స్వర్గమై తోచు ఘర్ష॥

చెప్పిన హిత మంతా, పెడ
చెవిని బెట్టి పుట్టినట్టి
నరజీవుల కేమొ చరా
చరములు నరకమై తోచు ఘర్ష॥

# విజయహేల

[విజయ పరంపరల స్వాగతాహ్వానిపై, యుగ యుగాలనుండి చీకటిపై వెలుగుకు, అధర్మంపై ధర్మానికి, అజ్ఞానంపై విజ్ఞానానికి విజయాన్ని ప్రసాదిస్తూ, మానవ కల్యాణానికి మంగళ గీతం పాడుతూ ఏటేటా వచ్చే విజయ దశమికి గీతికాస్వాగతమే ఈ సంగీత రూపకంలోని ఇతివృత్తం. ఇందులో విజయదశమీ, మరి నాలుగు కంఠాలూ పాత్రలుగా వస్తాయి. ఈ కంఠాలలో రెండు స్త్రీ పాత్రలు, రెండు పురుష పాత్రలు కావచ్చు. ఈ నాలుగు పాత్రలు ఒకే ప్రజాశక్తికి విభిన్న ప్రతిబింబాలు.]

బృంద గానం :

ఎన్నెన్నో విజయాల
కన్నట్టి తల్లీ !
ఎన్నో ఆనందాల
నేలు జాబిల్లీ !
రావమ్మ, రావమ్మ
ఓ విజయ దశమీ !

నీ ఉత్సవము కొరకు
నిర్మించినట్టి
మా మనో మాలికల
మందిరములోకి
రావమ్మ, రావమ్మ
ఓ విజయ దశమీ!

## మొదటి కంఠం:

మహా మాయులగు
మధు కైటభులను
శక్తిరూపమున
జయించి వెలసిన

మాయాదేవీ, రావమ్మా!
మహాకాళి నీవే నమ్మా!

హరిహర కోపా
నల రూపముపై
మహికంటకుని
మహిషుని ద్రుంచిన

మహిషాసుర మర్దని వమ్మా!
మహాలక్ష్మి, స్వాగతమమ్మా! !

## రెండవ కంఠం:

క్షుద్రాసురులగు
శంభునిశంభుల
చండముండులను
చెండాడిన, ఓ

చాముండేశ్వరి, రావమ్మా!
సరస్వతివి నీవే నమ్మా!

హింసాత్మం డగు
కంసుని ద్రుంచిన
బాల కృష్ణునికి
ప్రాణంపోసిన

తారా దేవి, రావమ్మా!
శారద లక్ష్మి, రావమ్మా!

## మూడవ కంఠం:

శాక ఫలాదులు
లోకమునకు ఇడి
క్షామ పిశాచి ని
షా వదలించిన
        శాకంబరి, వే రావమ్మా!
        రక్తదంతి, స్వాగతమమ్మా!

ఉగ్ర రూపమున
హూంకరించుచు
దుష్ట రాక్షసుని
దుర్గుని చంపిన
        దుర్గాదేవీ, రావమ్మా!
        దురిత నివారిణి, రావమ్మా!

## నాల్గవ కంఠం

ప్రజాహితముకై
భ్రమరాస్త్రమ్ముల
అరుణాసురు సం
హారణము చేసిన
        భ్రమరాంబా, స్వాగతమమ్మా !
        మాతంగీ, మము కనవమ్మా !

జయజయ భారత
జనతాభ్యుదయిని
రాగోషస్విని
జయ కాత్యాయిని
        విజయ దశమి, స్వాగతమమ్మా !
        విజయాంబర ఝరి, రావమ్మా !

## బృంద గానం

ఏ నా డుదయించితివో
కాని నీవు మాతా !
ఎడతెగని సమరములలో
గడచె కాల మంతా

శాంతిని, ధర్మమ్మును ర
క్షణ చేయుటలో నీవు
పడిన ఇడుమ లెన్నెన్నో
పిడుగుపాటు లెన్నెన్నో

మానవతా శక్తి పెంచి
దానవతా శిరము వంచి
యుగయుగాలనుండి జగత్
ప్రగతి కారణము వైతివి.

### మొదటి రెండు కంఠాలు :

నీతి లేని రావణు డల సీతను చెరబట్టె
మేర మీరి భరత జాతి మీద కత్తికట్టె
ధర్మమూర్తి రాముడు కోదండ మెక్కుపెట్టి
దనుజుల, దశకంఠు వార్ధి దాటి మట్టుపెట్టి
సీతను విడిపించె నెవరి శక్తిచే ?
భరత
జాతిని రక్షించె నెవరి మహిమచే ?

### చివరి రెండు కంఠాలు :

నిర్మలమౌ నీ పూజా ఫలముచే !
నీ విచ్చిన అభయహస్త బలముచే !

### మొదటి రెండు కంఠాలు :

అల కౌరవులు ద్రౌపదిని అవమానించారు
వంచనతో పాండవులను వనముల కంపారు—
శాంతి ధనులు పాండవులే శస్త్రపూజ చేసి
కురుభూమిని హరులై భారత రణము చేసి
కురు శతమును కూల్చి రెవరి చలువచే ?
ధర్మ
ఘోషణ మొనరించి రెవరి కరుణచే ?

### చివరి రెండు కంఠాలు :

నీ మెచ్చిన నిండు త్యాగ ఫలముచే !
నీ విచ్చిన అమిత భుజా బలముచే !

### మొదటి రెండు కంఠాలు :

భారతమాత పారతంత్ర్య బంధనాల చిక్కె—
లేమితో వికాసమేమి లేమి తోడ స్రుక్కె—
శాంత్యహింస సత్యాగ్రహ శస్త్రము సంధించి
జాతి జాతి నెల్ల, గాంధితాతయ నడిపించి
విజయము సాధించె నెవరి రక్షచే ?
త్రివర్ణ
ధ్వజములేపె నెవరి దయాభిక్షచే ?

### చివరి రెండు కంఠాలు

నీ నిరంతరాశీ రక్షతలచే !
నీ విచ్చిన ఆశయదక్షతలచే !

## విజయ దశమి

ఓ ధర్మాధర్మ విచక్షణులారా !
ఓ భారత నరనారీమణులారా !

మీ వీరోచిత విజయా
లే విజయమ్ములు నాకు
మీ దురదృష్టాపజయా
లే అపజయములు నాకు. ఓ॥

మధుకైటభులను ద్రుంచుట
మహిషాసురు తెగటార్చుట
మీ ప్రేమాదేశము పాటించుటకే
మీరు నేను సుఖముగ జీవించుటకే. ఓ॥

రావణులను, కౌరవులను
రణమున హతమార్చుటలో
సాయపడితి మీ దీక్షకు దాసినై
శాంతియజ్ఞమున ఇంధనరాశినై. ఓ॥

మీరు ధర్మయోధులైతె
నేను విజయకోట నౌదు
మీరు శాంతి వల్లులైతె
నేను విజయవాటి నౌదు. ఓ॥

## బృందగానం :

ఎంత మెత్తని మనసు నీది
ఎంత మహదాశయము నీది
విజయమాలానేక భూషిత
వినయశీల దయోపయోధీ !

## మొదటి రెండు కంఠాలు :

నా దజంతాలోన కళలకు
నాటితివి ఉరు విజయవాటి
వ్యాసభారత మందు వాణికి
వేసితివి ఘన విజయ పీఠి.

## చివరి రెండు కంఠాలు :

గాన లక్ష్మికి త్యాగరాయని
గళములో జయమాల వేసితి
ప్రణయ దేవికి తాజమహలున
ఘన విజయ కేతనము లేపితి.

## మొదటి రెండు కంఠాలు :

కాశ్మీరున, అరకు లోయల
బాక్రాలో, నంది కొండల
ప్రకృతి కన్యకు ఆరిపోవని
విజయ హాసము కూర్చినావు.

## బృంద గానం :

సమరాలు చేశావు
సమరాలు చూశావు
సమరాలలో తగిన
సాయమ్ము చేశావు
మము మరచిపోకు ఈ నాడు
నేటి
సమరాల మా గెలుపు చూడు!
అజ్ఞాన తాటకిని
హతమార్చ నిలిచాము
దారిద్ర్య మకరిపై
దండెత్తి కదిలాము
విజయమ్ము మాకిమ్ము తల్లీ !
ప్రగతి
వీణ మ్రోగించుమో తల్లీ ! సమ॥

స్వార్థమ్ము మా "లోని"
శత్రువై ఒకవైపు
శత నియంతలు "బయటి"
శత్రులై ఒక వైపు
కత్తిగట్టిరి భరతజాతిపై
జయము
కల్గించు మాకెపుడు వారిపై ! సమ॥

కల్యాణ మార్గాన
కష్టించు శ్రామికుల
శాస్త్రజ్ఞులను, కళా
సాధకుల దీవించు
చేలలో విజయమ్ము నించుమా !
ఫ్యాక్ట
రీలలో విజయమ్ము పెంచుమా ! సమ॥

## విజయ దశమి :

జయం ధర్మమునకు
పాడివీడి నూరుగురు
అపజయం అధర్మమునకు—
ఓడినారు కౌరవులు
పాడి వీడనట్టి పంచ
పాండవుల కరాలలో. జయం॥

పది తల లుండిన రావణ
బ్రహ్మ నీతి ఎరుగ లేక
పతన మౌట నేటి భుజా
బలులకు గుణపాఠం. జయం॥

యుద్ధమ్మును కోరే
దుర్యోధను లెందరో లేరు
శాంతిని కాంక్షించే
కృష్ణార్జునులే కల రెల్లడ జయం॥

అణ్వాయుధ శక్తి కన్న
ఆత్మ బలమే మిన్న
బాంబు బలము కాదు
దేశభక్తిని పెంచా లన్నా ! జయం॥

## బృంద గానం :

జయము జయవిజయీ భవా !
జయము దిగ్విజయీ భవా !
జయము స్వార్థ త్యాగమునకు
జయము నిర్మల దేశభక్తికి
జయము చీకటిపైన కాంతికి
జయము విజయము విశ్వశాంతికి

పశుబలముపై ఆత్మ శక్తికి
వంచకులపై ప్రజా శక్తికి
ద్వేషములపై ప్రేమ శక్తికి
బానిసత్వముపైన స్వేచ్ఛకు. జయము॥

# కల్యాణ యాత్ర

[మానవుణ్ణి విభిన్న శక్తులు చుట్టుముట్టి కలవర పెడుతున్నాయి. ప్రకృతి, ప్రేయసి, మాతృదేవి, కష్టజీవి, భాగ్యలక్ష్మి, దేశమాత వంటి శక్తులు అతణ్ని తమతమ స్వాధీనంలోకి లాగుతూ పోటీ పడతాయి. ఈ ఘర్షణలో కర్తవ్యతా మూఢుడైన మానవుడు సర్వశక్తి సమన్వయ కల్యాణ మార్గాన్ని తెలిసికోవడం ఈ గేయ రూపకంలోని ఇతివృత్తం.]

(యథోచితమైన రంగం మీద మానవుడు ప్రవేశించి జిజ్ఞాసా మనస్కుడై)

**మానవుడు :**

ఎపుడు పుట్టెనో
ఎటుల పుట్టెనో
ఏల పుట్టెనో ఈ సృష్టి !
జనన మేమిటో
మరణ మేమిటో
మధ్య జీవితపు మర్మ మేమిటో !
ప్రశ్నకుత్తరము
పది ప్రశ్నలుగా
బ్రతుకు మానవుని బ్రతు కెందులకో ! ఎపుడు॥

(అప్పుడు ప్రకృతి కాంత రంగం మీదికి ప్రవేశించి మానవుణ్ని సమాధాన పరిచే దృష్టితో)

ప్రకృతి :

ఏలరా మానవుడ ? సందే
హాలు నీ కీ వేళలో ?
అన్ని పరమార్థాలు, ఆనం
దాలు గల ఏ ప్రకృతిలో—

లక్ష ప్రశ్నలతోడ జీవిత
లక్ష్యమును కోల్పోకుమా
వెఱ్ఱి ఆలోచనలతో ఇది
వింత జగ మనుకోకుమా ! ఏలరా॥

భూ గగనములు మొదలు
పంచభూతములు నా కోసమే,
నా అనంత కళావిలాసము
నా బ్రతుకు నీ కోసమే ! ఏలరా॥

గిరులు, ఝరులు, తరులు, విరులు
పరచితిని మన పోవు దారుల
బరువు బాధలు విరిచి, తలుపులు
తెరచితిని అభ్యుదయ సీమకు ఏలరా॥

(ప్రకృతి కాంత ముందుకు పోయి అలా అలా కనుమరుగై పోతుంది. మానవుడు ప్రకృతి వెంట పోబోతుండగా, ప్రేయసి ప్రవేశించి)

ప్రేయసి :

ఓహో మానవుడా !
ఓహో జిజ్ఞాసువా !
నోరు లేని ప్రకృతిని గని
నోరూరగ నిలువకుమా !
మరు మరీచికలను చూచి
మధువని భ్రమపడకుమా !

నీ ప్రేయసి నీ ముందర
నిలుచున్నది కన లేవా !
తన పూవుల గుండె పరచి
నిను రమ్మని పిలిచెరా ! ఓహో॥

వాడని వలపుల పూవుల
వల్లికనై వచ్చితిరా !
నీ కోసం మధుభాండము
నింగి నుండి తెచ్చితిరా ! ఓహో॥

నా వెచ్చని కౌగిలిలో
వేవేల సుఖా లున్నవి
నా అధరామృతములో
నవజీవన రుచు లున్నవి ! ఓహో॥

రారా నా మధురోహల
రాగమా ! సరాగమా !
నన్ను వలచి మైమరచి
నాదు సుక లేలుమా ! ఓహో॥

## మానవుడు :

ప్రకృతి కన్న మిన్న ఏమి
ప్రణయినిలో ఉన్నది ?
ప్రణయిని హాసము లేనిది
ప్రకృతిలోన ఏమున్నది ?

తర్కించిన కొలది నిజము
తల్లక్రిందు లౌతున్నది,
ఎవరి మాటలోని సత్య
మేమొ తెలియరాకున్నది.

*[మానవుడు ప్రేయసివెంట పోబోతుండగా, మాతృదేవి ప్రవేశిస్తుంది. ప్రేయసి నిష్క్రమిస్తుంది.]*

**మాతృదేవి :**

ఎన్ని ఎన్ని కలలు గని
నిన్ను నేను కంటినిరా,
ఎన్ని బాములను సైచి
నిన్ను పెంచుకొంటినిరా !

నా ఆశలు రూపించిన
నా జీవన ఫలమా !
నిన్ను వీడి క్షణమైనా
నేను నిల్వగలనా ? ఎన్ని॥

"ప్రకృతి" అని, "ప్రణయిని" అని
పరుగులెత్తు చున్నావా ?
కొడుకా ! నీ తల్లినే
విడిచిపోవు చున్నావా ? ఎన్ని॥

విష మైనా మ్రింగి నిన్ను
పెంచి పెద్ద జేసినట్టి
పేదరాలు నీ తల్లే
విషమై పోయిన దటరా ? ఎన్ని॥

*[మానవుడు మాతృప్రేమానుబద్ధుడై తల్లి ననుసరించి పోబోతుండగా, తిరిగి ప్రకృతి ప్రవేశిస్తుంది. తల్లి నిష్క్రమిస్తుంది.]*

**ప్రకృతి :**

త్వరపడకుమా
పొరపడకుమా
పసిపాప వలె నీవు
భయపడకుమా !

పక్షిగణమై నేను
పాడేనురా
ఝురులు నిర్ఝరము లై
ఆడేనురా
నీ కోసమై – నీ కోసమై. త్వర॥

వనబాలనై నేను
వచ్చానురా
తీయ తీయని కలలు
తెచ్చానురా
నీ కోసమే - నీ కోసమే. త్వర॥

క్షణిక భోగాలకై
చెడిపోకురా
మమత కూపములోన
పడిపోకురా. త్వర॥

నీ లోని కళలు నా
లో దాచుకో
నన్ను నీలో ఐక్య
మొనరించుకో. త్వర॥

*[ప్రకృతి రంగం మీద ఒక ప్రక్కన మానవుని నిర్ణయానికై నిరీక్షిస్తుండగా, సంశయాత్ముడైన మానవుడు–]*

**మానవుడు :**

ఇల్లు వీడి పోతా నంటే
తల్లేమో వద్దంటుంది,
తల్లిమాట వింటా నంటే
ప్రకృతేమో తగదంటుంది.

ప్రకృతికి వశమౌతా నంటే
ప్రణయిని నను జడు డంటుంది.

నా గుండెను బాధలతోడ
నలిపి నలిపి వేస్తా రేలా ?
నాలో విషనాగ ఫణాలను
నాట్యము చేయిస్తా రేలా ?

*[మానవుడు సందిగ్ధావస్థలో నుంచి ఇంకా తేరుకోకముందే కష్టజీవి ప్రవేశిస్తాడు. అతణ్ని చూచి ప్రకృతి నిష్క్రమిస్తుంది.]*

## కష్టజీవి :

పొలాలలో, గహనాలలో
పరిశ్రమలలో, ఫ్యాక్టరీలలో
పనిచేసే ఈ కష్ట జీవునకు
ఫలిత మేమిటో,
పస్తులు పండుటే నటో ?

పలుక వేమిరా, మనిషీ !
కలత పడ్డ మూగ మనసు
పలుకరించినా
మారు పలుక వేమిరా.

చీకు చింత లేని ప్రకృతి
చెంత కరిగి పోదువా ?
కామినీ పరీరంభ
సుఖాల నేలుకొందువా ?

తల్లి ఒడిని చేరి, స్వార్థము
తప్ప వేరు కోరు కొనవా ? పలుక॥

నా దైన్యము చూచి నీలో
దయ ఇంచుక కల్గదో
నీ కోసం కాన్క లేమి
గైకొని రాలేదనో ? పలుక॥

రక్షింతువో లేక నను
నిర్లక్షింతువో ? మానవా !
నీపైనే ఆశ లన్ని
నింపుకొంటి కానవా ? పలుక॥

**మానవుడు :**

చాలు చాలును
ఉన్న గొడవలు చాలు నాకు
నీవు సైతము
నింద నాపై వేయ బోకు
దీన జీవి !
నీకు కూడా దిక్కు నేనా.
చీకటులలో మునిగి
వెలుతురు చింద గలనా ?

*(మానవుడు సానుభూతితో కష్టజీవితో కలిసి పోబోతుండగా, తిరిగి ప్రేయసి ప్రవేశిస్తుంది. కష్టజీవి నిష్క్రమిస్తాడు.)*

**ప్రేయసి :**

కష్టపడుట వారివారి
ఖర్మమూ
పకీరు కేకలకు కలత
పడకుమూ !
నన్ను చేరి చూడు, స్వర్గ
మున్నదీ
నన్ను విడుచేను, నరక
మన్నది.
ప్రకృతి మాట, గికృతి మాట
పట్టకూ
పేదవాని ఆర్తి చెవిని
పెట్టకూ.

*(మానవుడు ప్రేయసికి వశుడై పోబోతుండగా, భాగ్యదేవత రంగం మీదికి ప్రవేశిస్తుంది. ప్రేయసి నిష్క్రమిస్తుంది.)*

## భాగ్యదేవత :

కన్నులుండి కూడ, నన్ను
కానలేవా ?
చేవ గల్గి కూడ, నన్ను
చేరలేవా ?

బ్రతుకలేని వారి వెంట
పడెద వేలా ?
విరుల తోట చూసి ముళ్లు
వెదక నేలా ?

అన్ని సుఖాలకు
సోపానమ్ము నేను
అన్ని కోర్కెలకు
ఆకారమ్ము నేను.

భాగ్యలక్ష్మినే, నను
చేపట్టు నేడే
భావ పిశాచాల చెదర
గొట్టు నేడే.

*[ఆ వెంటనే కష్టజీవి కలవరపాటుతో రంగంమీదికి వస్తాడు. భాగ్యదేవత నిష్క్రమిస్తుంది. అప్పుడు కష్టజీవి-]*

## కష్టజీవి

భాగ్యదేవత శింజినీ శింజితాలలో
నా ఆకలి కేకలు వినబడునా ?
కనులలో కదలాడు కలల వెన్నెలలలో
నా వంగిన నడుమే కనబడునా ?

**మానవుడు :**

ఏమి టీ పరీక్షలు? నా
కేల ఇన్ని శిక్షలు ?
ఇందరికిని నా మీదే
ఎందులకో కక్షలు !

*(అని మానవుడు దిగాలు పడుతుండగా, ప్రవేశిస్తుంది దేశమాత రంగంమీదికి.)*

**దేశమాత :**

హిమ గిరీంద్ర ధవళ కాంతి
మకుట మున్న నేమాయెను ?
రత్న ఖచిత వింధ్యాచల
మేఖలతో నేమాయెను ?

గంగా యమునలు చేలాం
చలము లైన నేమాయెను ?
నా వాకిట మహిమాన్విత
జలధులున్న నేమాయను ?

నా ప్రియనందను లందరు
నన్ను కానకున్నప్పుడు
మా మక జీవితము వట్టి
మట్టి మాత్రమే కాదా ?

దేశమాత దీనముగా
నిన్ను పిలుచు చున్నదిరా !
నవ యువకా ! అల్ప
భావనలతో పరుగిడకురా !

రాక్షసత్వమును ద్రుంచి
రక్షించుము నా స్వేచ్ఛను,
నీ సర్వస్వమ్ము నిచ్చి
నిల్పుము నా చిరకీర్తిని.

*(దేశమాత ఉద్బోధనలో ఉద్రిక్తమానసుడైన మానవుని చెంతకు మాతృదేవి పభృతులు ఒక్కొక్కరే ప్రవేశించి.)*

మాతృదేవి :

మాతను కాదని, దేశ
మాతను కొలిచెదవా ?
ఇతరుల సుఖమునకై నీ
ఇంటిని మరచెదవా ?

ప్రేయసి :

పొలికేకలు నమ్మి, బ్రతుకు
విలువలు మరిచెదవా ?
చెలి కోరిక త్రోసి
కష్టమును కోరుకొనెదవా ?

కష్టజీవి :

ప్రేయసి వలలో పడి, నిరు
పేదల విడిచెదవా ?
స్వార్థమునకు లోబడి, పర
మార్థము మరచెదవా ?

ప్రకృతి :

మోమోటము పడి, పదుగురి
మోసములో పడకురా!
నా మాటలు నమ్మి, కళా
సీమ లేలుకొనుమురా !

## భాగ్యదేవత :

దారిని పోయే వారికి
దాసోహ మ్మనకోయి,
నీవు నేను ఏకమైతె
నిఖిల జగము మనదోయీ !

## దేశమాత :

విజయ పథము చూపినాను
నిజమేదో తెలిపినాను
మంచి చెడు గ్రహించెదవో
మతి చెడి వర్తించెదవో ?

## మానవుడు :

పరవశము కల్గించు
ప్రకృతి సుందరి గాన
పరిమళ మ్మొక వైపునా ,
అమృతమ్ము కురిపించు
ప్రియురాలి ప్రణయ
సంధ్యారాగ మొక వైపునా.

కరుణ రూపము గొన్న
నా కన్నతల్లి
పరివేదన మ్మొక వైపునా,
ఆవేదనల ముంచు
కష్టజీవుని క్షుభిత
ఆర్తరవ మొక వైపునా.

ఆశలను కలిగించు
భాగ్యదేవత
విచిత్రాకర్ష ణొకవైపునా,

ఆశయము బోధించు
దేశ మాత అర్ధి
సందేశమ్ము ఒక వైపునా.

భిన్న భిన్న గళాలు
నన్ను రమ్మని పిలుచు
ఎవరి దారిని పోదును !
నా బ్రతుకు
ఎరివకై వెచ్చింతును !

## నేపథ్యవాణి :

భావ ఘర్షణతోడ
బాధపడుచున్న ఓ మానవా !
దారి తెలియని అడవి
దూరి వెతజెందు, ఓ పథికుడా !

ఈ సృష్టి కర్థము
ఈశ్వరునికే తెలుసు
ఈశ్వరుని జాడ
జ్ఞానేంద్రియాలకు తెలుసు. భావ॥

సృష్టి కంతటికి సం
క్షిప్త రూపము నీవు
భిన్న శక్తుల ఐక్య
బిందు రూపము నీవు. భావ॥

తెలుసుకో నీలోని
తేజ స్స్వరూపమును
కలుపుకో అందరిని
కల్యాణ యాత్రలో. భావ॥

*[అంతా ఆశ్చర్యంతో వింటూ ఉంటారు. ఒకరివైపు ఒకరు ప్రశ్నార్థకంగా చూచుకొంటుండగా నేపథ్యవాణి ఆదేశాలకు అనుగుణంగా ఆయా పాత్రలతో చేరుతూ ఉంటాడు మానవుడు.]*

## నేపథ్యవాణి :

ప్రకృతి రాగ మాధురులను
పాటలుగా పాడుకొంచు
ప్రాణసతిని కూడి తల్లి
పాదాలను చేరుకో.

తల్లి దీవనలను పొంది
చల్లంగా జీవించుచు
నీ భాగ్యము తోడి ప్రజలతో
భాగము పంచుకో.

దేశ భక్తి, మానవ
సంక్షేమ సుఖా సక్తి కల్గి
అందరి ఆనందము నీ
ఆదర్శము చేసుకో.

నీ విజయమున చరాచర
భూ వలయము పరిమళించు
దేశ మాత స్వాతంత్ర్యో
ద్దీపితయై శోభించును.

*(మానవుడు అన్ని పాత్రలతో సమన్వాయం పొందిన తర్వాత విజయానందంలో అందరూ కలసి.)*

## బృందగానం :

ప్రేమరథం
భాగ్య పథం
మీద సాగి పోవాలి.

పేదరాలి
భాగ్యశాలి
మధ్య తెరలు తొలగాలి.

భిన్న భిన్న
శక్తి లతలు
ప్రగతి వనిని విరియాలి. ప్రేమ॥

స్వార్థమ్ములు
సమరమ్ములు
సమసి శాంతి వెలగాలి.

మమత మీద
మతము మీద
దేశ భక్తి నిలవాలి. ప్రేమ॥

# రాకెట్టు రాయబారం

[మానవుడు భూమిని జయించాడు. నీటిని కూడ జయించాడు. ఇప్పుడు ఆకాశాన్ని జయిస్తున్నాడు. అనంత రోదసీయాత్రలో చంద్ర మండలం తొలి సోపానం అయింది. మానవుడు పంపిన "రాకెట్టు" చంద్రమండలాన్ని చేరుకున్నది. రాకెట్టు చంద్రమండలానికి భూమండ లానికి సన్నిహిత సంబంధాలు నెలకొల్పుతుందని ఆశిస్తున్నాడు అతడు.

["రాకెట్టు" మానవుని రాయబారిగా, చంద్రగోళం "చంద్ర కాంత"గా ఇందులో చిత్రించటం జరిగింది. చంద్రకాంతకు, రాకెట్టుకు జరిగిన ఊహా సంభాషణ ఈ గేయ రూపకానికి ఇతివృత్తం.]

(రంగంమీద చంద్రబింబాన్ని తలపింపజేసే వేషధారణతో చంద్ర కాంత ఆలోచనా మగ్నమానసంతో ఆసీనురాలై ఉంటుంది. నేపథ్యంలో నానా భావస్ఫోరకమైన విచిత్ర విస్మయాత్మక ధ్వని ఏదో వినిపిస్తూ ఉంటుంది. అంతలో విజృంభించిన నేపథ్య ఘోషణమధ్య రాకెట్టు రంగం మీదికి దూకుతుంది. రాకెట్టు పాత్రధారి రాకెట్టును స్ఫురింపజేసే వేషంలో ఉంటాడు. అప్పుడు చంద్రకాంత చైతన్యోద్దీపితయై—)

**చంద్రకాంత :**

లక్షలాది మైళ్ళు, అంత
రిక్ష మార్గములోన ఎగసి
ఎంచలేని జవమ్ముతో, ఏ
తెంచినావా? ఇన్నినాళ్ళకు!

స్వాగతము ! స్వాగతము ! మానవ
జగము పంపిన రాయబారీ !

ఎన్ని నాళ్లాయె నయ్యా, రా
కెట్టు స్వామీ ! బయలుదేరి ?
క్షేమ మేనా జగజ్జననికి
క్షేమ మేనా జగజ్జనతకు ? స్వాగ॥

క్షేమ వార్తల నెల్ల నా హ్రా
ద్యూమి పండగ విన్నవింపుము,
అలసిపోయితి వేమొ ఈ సిక
తా తలమ్మున విశ్రమింపుము స్వాగ॥

## రాకెట్టు

వందన మమ్మా ! కృతజ్ఞతాభి
వందన మమ్మా నీకు,
ఇందుదేవి ! నీ స్వాగతమ్ము, ఆ
నందము పిండెను నాకు

క్షేమ మమ్మ భూలోక మంతకును
క్షేమమేను మానవులు
నీ మహా జగత్ క్షేమ మారయగ
నేను పంపబడినాను వందన॥

ఈ నాటికి మానవులు చేయు, వి
జ్ఞాన యాగము ఫలించె
నరుల యుగయుగమ్ముల ఆశాస్వ
ప్నములు ఆకృతి ధరించే వందన॥

త్వరలోనే నీ సుందర లోకము
దర్శించగ ఆశించి,
అమృత హృదయ ! నను పంపినారు నీ
అనుజ్ఞ గైకొన నెంచి వందన॥

మరియొక నూతన కాండము ప్రారంభ
మౌను సృష్టి చరితలో
ఉజ్జ్వలమౌ ఈ కథా నిర్వహణ
మున్నది నీ చేతులలో వందన॥

## రాకెట్టు:

ఏమి టేమిటీ భూవాసులు నా
సీమకు రా నున్నారా ?
నా విశాల నిర్జన భూమికి ప్రా
ణమ్ములు తే నున్నారా ?
పూచేనా నే పెంచిన ఆశలు
వీచేనా గంధములు ?
చైతన్యము నా ఎడారి బ్రతుకున
చిందేనా అందములు ?

## రాకెట్టు:

నీ దెంత ప్రేమగల నిండు హృదయము తల్లి !
నిజము, నీలో కళంకము లేదు జాబిల్లి,

ఎనలేని సంపదల గనులు గల్గిన నీకు
ఎటు లంటు అల్పత్వమో కల్పవల్లీ!

## చంద్రకాంత :

ఇన్ని సంపద లుండియును నా
కేమి సార్థక మయ్యె నయ్యా !
అనుభవించెడి వాడు లే నపు
డమృతమునకును విలువ గలదా ?

5)

ధరణిపై మానవులు అల్పపు
ధనముకై పోరాడు చుండుట
తిండి గుడ్డలు లేక కొందరు
దీనులై విలపించు చుండుట
చూచినప్పుడు నా ఎడద సం
క్షుభితమై దహియించి పోవును ఇన్ని॥

"అమితమౌ నా భాగ్య రాసుల
అందుకొను" దని పిలువ నెంతును
అంత దూరము పిల్చుటకు నా
గొంతు చాలమి చింత పడుదును
"ఒక్కనాటికి ఎన్నడో రా
కుందురా" యని తృప్తి పడుదును ఇన్ని॥

## రాకెట్టు :

నిను గన్న సృష్టి ఎంతటి ధన్యురాలు
నీలోన కరుణాప్రభా ఝురులు పారు
నీ రూపమే కాదు నీ ఆత్మ కూడా
నిజముగా సౌందర్య నిలయమ్ము తల్లీ !

మనుషులకు నీవు అభిమాన దేవతవు
నిను జూడ కవుల గుండెలు పొంగి పారు
నీ రూపు, నీ వెల్గు, నీ మాట లేక
కావ్యమ్ము లేదు చక్కని గాథ లేదు

## చంద్రకాంత :

ఎవ్వరు విడదీశారో
ఇలా గోళమును-నన్ను ?
అయినా మా మధ్య నున్న
అనురాగము విడిపోనిది

నా రాకకు పొంగిపోవు నీరాకరముల చూచి
నా కాంతికి తన్మయ మయ్యే కల్వల కనుల చూచి
అయిపోదును ఆనందమ్ముల పున్నమ నేను
అమృత భావ కౌముదీ మహాలయమ్ము నేను ఎవ్వరు॥

ఈతిబాధ లేమొ నరుల హింసించెడి వేళ
నీతి లేని స్వార్థమ్ములు రూపించెడి వేళ
నా ఎడంద కరిగి కరిగి తరుగును
నా కన్నుల అమవాస్యలు తిరుగును ఎవ్వరు॥

రాకెట్టు :

ఔను నీ చలువచూపులలోన లోకమ్ము
హాయిగా నిదురించు, ఆనందము వహించు
నిను జూడ పసిపాపయును పరవశము జెందు
ప్రేమ జీవుల హృదయ సీమలు గుబాళించు

చంద్రకాంత :

కలహమతుడు భో
గ లాలసుడు మా
నవు డదెట్టులో నేడు

సృజనాత్మక చే
తనుం డగుచు నా
కజ సన్నిభు డైనాడు !

పుక్కిటి పురాణ
ములతో జపతప
ములతో నటించువారు

ఊర్ధ్వ దృష్టి గల
ఉజ్జ్వలాశ యో
ద్దీపితు లెట్లైనారు !

## రాకెట్టు :

మానవుని పరిణామ చరితం
మహిత యాతనా భరితం
గురుతులేదా చంద్ర మాతా!
ధారుణీ మాతా సజాతా!

కొండ కొమ్మల తిరిగినాడు
గుహలలో నివసించినాడు
వెలుగు చీకటి మధ్య వందల
వేల యుగములు నలిగినాడు, మానవుని॥

ఇల్లు వాకిలి కట్టుకొనెనో
ఇంతొ అంతో చదువుకొనెనో
లీల నాతని లోన స్వార్థము
లేచి హింసకు పూనినాడు. మానవుని॥

తప్పు లొప్పులు అరసి తెలిసి
ఇప్పు డిపుడే ఇంగితుండై
శాంతి సహజీవనము కోరి
క్రాంతి పథమున వెడలినాడు. మానవుని॥

అనుభవమ్ములు పెంచి మేధా
జనిత విజ్ఞానమును పంచి
పుడమినే స్వర్గమున కెత్తగ
పూని దీక్ష వహించినాడు. మానవుని॥

## చంద్రకాంత :

అందుకేనా నేటి
కాతనికి మాపై
ఎనలేని కరుణ క
ల్గినది దూతోత్తమా!

ఎన్న డిచ్చటికి రా
నున్నాడో చెపుమా ?
ఏమేమి చేయ నుం
కించెనో చెపుమా ?

### రాకెట్టు :

నరుడు రానున్నాడు నరుడు రానున్నాడు
తన శాస్త్ర విజ్ఞాన ధనము తేనున్నాడు ॥

క్షుద్ర సంకుచితత్వ
కుడ్యాలు లంఘించి
ప్రకృతి శక్తులకు తన
ప్రతిభలను జోడించి
అణుగర్భమున జీవ
నామృతము పండించి నరుడు॥

సకల గ్రహాలతో
సంబంధములు పెంచ
ప్రాణికోటులకు శా
శ్వత సుఖమ్ములు పంచ
సృష్టి సర్వమ్మొక్క
సూత్రాన సంధించ
నున్నాడు, నరుడు రానున్నాడు జాబిలీ ! నరుడు॥

### చంద్రకాంత :

ఎరిగించుము రాకెట్టు సుధీరా !
సాహసులౌ నరులకు ఈ మాట

ఈ కొండలలో కనకము కలదని
ఈ ఇసుకలోన అమృత మున్నదని
ఇచ్చట శీతోష్ణమ్ములు కలవని
ఇంపు గొల్పు దృశ్యమ్ములు కలవని ఎరిగిం॥

ఈ గాలి పొరల తేల వచ్చునని
ఇట సర్వము సృష్టించ వచ్చునని
ఆడవచ్చునని పాడవచ్చునని
అభయముగా జీవించ వచ్చునని

ఎరిగించుము రాకెట్టు సుధీరా !
నరులను రమ్మన వోయి త్వరత్వర ॥

## రాకెట్టు :

సిత కపోత కేతనాంక
పంచశీల రథముపై
జగన్నాయకులు వెడలిరి
నవోదయోన్ముఖులై.

మానవాభ్యుదయమునకు ప్ర
మాదము లే దెన్నటికి
అందింతును నీ ఆహ్వా
నము మానవ కోటికి సిత॥

మరలవత్తు నమ్మ, తెత్తు
నమ్మ నరుని మోసికొని
సృష్టి సౌధములో క్రొత్త
తలపు ఒకటి తీసుకొని సిత॥

ధన్యోస్మి, నిన్ను చేరి
దర్శించితి ప్రప్రథమము
ఈ నవ జీవన యాన
మ్మోనుగాక శుభప్రదము. సిత॥

*(రాకెట్టు సెలవు తీసుకొని నిష్క్రమిస్తాడు. చంద్రకాంత ఆనందాతిరేకంతో నృత్యం చేస్తుంది. విజయ కాహళులు మ్రోగుతుండగా తెర జారుతుంది. అప్పుడు నేపథ్యంనుంచి ఆకాశవాణి వినిపిస్తుంది.)*

**ఆకాశవాణి :**

రాకెట్టు రాయబారము ఫలించినది
ఆ కేపుకెనడి అంజలి ఘటించినది
బాహుబలుడై బుద్ధిబలుడై సాహసియై
నరుడు అడుగిడె చంద్ర జగతిపై తొలిసారి
నవ మానవాశాగ్రమున మ్రోగె జయభేరి !!

*[ఈ రచన 1959లో — అంటే మానవుడు చంద్రగోళంపై వాస్తంగా దిగడానికి (21-7-69) ఒక దశాబ్దం ముందే - చేయడం జరిగింది. ఆ నాడిది కేవలం ఒక కవితా కల్పన. కల్పన నిజమైన తర్వాత ఈ రచన రెండవ ముద్రణలో చివరి ఆకాశవాణి గొంతును చేర్చాను. కవిచేసే అభ్యుదయ భావనలన్నీ ఇలానే నిజమైతే ఎంతో బాగుంటుంది కదూ!]*

# చాచా నెహ్రూ

(నవభారత నిర్మాత పండితజవార్ లాల్ నెహ్రూ బాలబాలికల ఆదర్శమూర్తి. పిల్లలను ప్రేమించిన మహాపురుషులలో ఆయన అగ్రగణ్యుడు. చాచాజీగా ఆయన భావి తరాల పసివాళ్ళహృదయాల్లో చైతన్యజ్యోతులు వెలిగిస్తుంటాడనడంలో సందేహంలేదు. అలాగే ఆయన సౌందర్యారాధకుడు. గులాబీలను గుండెకు అద్దుకునేవాడు. పాపలు, గులాబీలు బహుశః పరస్పర ప్రతిబింబాలేమో. నెహ్రూజీ జన్మదినం 14వ నవంబరు ఇందుకే బాలకోటికి పండుగ రోజయింది. హిమవన్నగ శిఖరంవంటి చాచాజీ బ్రతుకు లోయల్లో వికసించే పసిపాపల ఆలోచనలలో పాలుపంచుకోవటం ఈ గేయ నాటికలోని ఇతివృత్తం. ఇందులో నెహ్రూ, గులాబీలు, బాలబాలికలు పాత్రలుగా వస్తారు. అదుగో రంగు రంగుల గులాబీలు నెహ్రూకోసం వెదుకుతూ రంగం మీదికి వచ్చాయి......)

**గులాబీలు :**

ఏడీ ! ఏడీ ! మమ్ముల
ఎద కద్దుకొనే తండ్రి ?
ఏడీ ! ఏడీ ! ఎన్నడు
వాడని నవ్వుల తండ్రి ?

శాంతి కాంతి దశదిశల
చల్లే మా నెహ్రూజీ,
ఇలనే స్వర్గము చేసెడి
కలలు కనే చాచాజీ ? ఏడీ॥

విరి తోటలు మా కోసం
వేయించిన రసరాట్
వన్నె చిన్నె లెన్నోమాకు
ప్రసాదించిన స్వరాట్ ? ఏడీ॥

పాప లన్న పూవు లన్న
పరవశ మొందే తపస్వి
ప్రజ లన్నా దేశ మన్న
ప్రాణ మిడే యశస్వి ? ఏడీ॥

(అంతలోనే చెంతలో ఉన్న బాలబాలికలు చాచాజీని వెదకుతూ గులాబీల గుండె గుబాళింపులు విని ఆనందాశ్చర్యాలతో తమ భావవిపంచికను మీటుతారు)

## బాల బాలికలు :

ఓహో ఓహో గులాబులారా !
ఓహో ఓహో నెచ్చెలులారా !

పాప లనీ పూవు లనీ
పాడుతుంది మీరేనా ?
పదపదమున మా ఎడదల
కదుపుతుంది మీరేనా ? ఓహో॥

ఏడీ మన చాచాజీ
ఎచట నైన చూశారా ?
తను పుట్టిన ఈ శుభదిన
మున పండుగ చేశారా ? ఓహో॥

ఏ పట్టున వెదకిన తన
రూపే కనపడ దాయెను
ఎంత పిలిచినా అతని
గొంతే వినవడ దాయెను ! ఓహో॥

(అప్పుడు తమకు సన్నిహితులైన పాపలను చూచి గులాబీలు విర బూచిన ప్రేమ హాసరేఖలతో గంతులు వేస్తాయి. అందరూ కలిసి భారత రత్నాన్ని అన్వేషిస్తూ తమ ఆవేదనా వీణకు శ్రుతి పెడతారు.)

నన్ను ఎందరు మరచిపోయిన
నన్ను ఎందరు విడిచి పోయిన
మరచిపోవక నన్ను తలచే
మంచి మనసుల అంచలారా ! పాప॥

కదలి ఒడిలో కరిగి పోతిని
నదుల ఎదలను నిదుర పోతిని
కాల కాళీచరణ ధూళిని
కలసిపోతిని గతమునైతిని పాప॥

మీ గళమ్ముల జీవనధ్వని
మేలుకొల్పెను నా సమాధిని
వినుటకై మీ ప్రగతి గీతము
వింతగా నే లేచివచ్చితి. పాప॥

*చైతన్యోద్దీపితులైన బాలబాలికలు, గులాబీలు తమ కృతజ్ఞతా పూర్వకమైన భావావేశాన్ని వెల్లడిస్తారు.)*

**బాల బాలికలు : గులాబీలు :**

ప్రేమయే నీ రూపమున మము
పిలిచెనా
అందమే నీ డెందమై మము
కలచెనా !

రాగమే నీ కంఠరవమై
త్యాగమే నీ జీవితమ్మై
మాకు సుందర భావిమార్గము
చూపెనా
మా కనులలో తేనె కలలు
లేపెనా ?

ఆశలే నీ పొసరుచులై
ఆశయమ్ములు నీ తలపులై
మానవతకే మధు వసంతము
నాటెనా
మనిషి నాడుల అనిమిషశ్రుతి
మీటెనా !

(అపుడు ఆచంద్రార్క్ర నయనుడైన జవహరుడు అవని హృదయాలపై అమృతవాక్ శీకరాలు చల్లుతాడు.)

## చాచాజీ :

మీరే మీరే ప్రేమభావాలు
మీరేలే శాంతి సౌరభాలు
నే నున్నా లేకున్నా
నా రూపము
మీ రూపములో
భద్రముగా నే దాచుకున్నా !

నే అన్నా అనకున్నా
మీ మాటల
మీ పాటల
లో నా భావాలను వినిపిస్తున్నా !

నే కన్నా కనకున్నా
మీ చేతలు
మీ రాతలు
నా భావాంబరమున ముద్రిస్తున్నా !

(చాచాజీ మనస్సును బాగా ఎరిగిన బాలబాలికలు, గులాబీలు తమ నిర్మలానుభూతులను అతనికి వినిపిస్తారు. దేశ పరిస్థితిని వివరిస్తారు.)

బాలబాలికలు : శాంతికోసం
సమతకోసం
సకల జనముల సుఖంకోసం
పాటుపడుతున్నట్టె కాని
ఫలితమే కనకుంటిమి !

గులాబీలు : కుల విభేదం
మత వివాదం
స్వార్థ జనిత సమర ప్రమాదం
వదలినా యనుకుంటె, వాటి
కామరూపం కంటిమి.

బాలబాలికలు : జయ జవాను
జయ కిసాను
జయ విజయ జయ క్రాంతి భాను
జాతి జీవన జడత్వముపై
జయము నేటికి పొందలే !

గులాబీలు : మాల పల్లి
మహా ఢిల్లి
ప్రణాళిక పథకా మతల్లి
మార్పు చక్రము ఎంత లాగిన
మాయ లేమి మాయలే !

*(అప్పుడు విచారగ్రస్తుడైన నెహ్రూజీ ప్రగతి పథంలో పొంచి వున్న పాముల గురించి హెచ్చరిస్తాడు.)*

**చాచాజీ :**

ద్వేషమును ఆసవముగా
సేవించువారు
స్వార్థమును పరమార్థముగా
భావించు వారు
క్రాంతి పథమున పొంచియుండిన పాములు
శాంతి సాగరమున విషాంతర్గాములు

వారి బారినుంచి ఈ
వసుధను రక్షించండి
మంచిని హింసించెడి దు
ర్మతులను శిక్షించండి ద్వేష॥

పారతంత్ర్యమును ఏ రూ
పమున నున్న చీల్చండి
కులమత నిర్మిత విభేద
కుడ్యాలను కూల్చండి ద్వేష॥

భారత సౌభాగ్య గీతి
హారతిగా పట్టనిచో
నా పుట్టిన దినమున మీ
రే పండుగ చేయకండి ద్వేష॥

*(చాచాజీ సందేశాన్ని అందుకొన్న బాలబాలికలు, గులాబీలు, అతని జీవితాదర్శాన్ని స్మరించుకుంటూ ఆశాగీతం ఆలపిస్తారు.)*

బాలబాలికలు : నీవే భరతావని వై
భరతావనియే నీవై
వెలిగే చాచా నెహ్రూ
వెలిగించు యుగయుగాలు

గులాబీలు : ప్రాజెక్టులు ఫ్యాక్టరీలు
ప్రగతి మందిరా లంటివి
శ్రమ జీవులె సమభావులె
సకల దేవతలు అంటివి

బాలబాలికలు : రాల జూచి, మేము కంట
కాల జూచి బెదరమండి
పథ మెంతటి కఠినమైన
ప్రగతి యాత్ర మానమండి

గులాబీలు : ఏ తోటను పూచిన నీ
ఎదయే మా గమ్యమండి
ఏగాడుపు వీచిన నీ
దే గానము విందు మండి

బాలబాలికలు : పచ్చని విప్లవ గీతులు
పాడే పంటచేలలో
ప్రగతికి దీపం పట్టే
ప్రరిశ్రమల నిను చూతుము

గులాబీలు : సూర్య బింబమున చవి
చూతుము నీ వెచ్చని మేధను
చంద్ర బింబమున కొందుము
చల్లని నీమానసమును

గులా-బాల : జైజై చాచా నెహ్రూ
జేజేలు నీకు
నీ పుట్టిన రోజే లే
మా పుట్టిన రోజు !

# యన్. జీ. వో.

*(యన్ జీ వో ప్రభుత్వ యంత్రాంగానికి పునాది. అతనిపై అధికార శ్రేణి ఎంతైనా ఉండవచ్చు. అతని జీవితం సామాన్యుని పేదరికంలో అంతర్భాగం. అటు ఆఫీసులో ఇటు ఇంటిలో మనశ్శాంతి లేక మథనపడే అతని నిత్యజీవిత సంక్షిప్తరూపాన్ని కళాత్మకంగా చిత్రించటానికి చేసిన ప్రయత్నమే ఈ గేయరూపకం. ఇందులో యన్ జీ వో, అతని భార్య, అతని ఆఫీసరు, అతని పిల్లలు పాత్రలు. ఈ రూపకాన్ని మూడు దృశ్యాలుగా ప్రదర్శింపవచ్చు.... )*

## మొదటి దృశ్యం :

*[అది ఒక ఆఫీసు. ఒక యన్ జీ వో హడావిడిగా వచ్చి, భయమూ వినయమూ ప్రదర్శిస్తూ ఆఫీసరు గదిలోకి ప్రవేశిస్తాడు. ఆఫీసరు గోడ గడియారం లోకి, తన చేతి గడియారం లోకి పదేపదే చూస్తూ, చిర్రుబుర్రాడుతూ, ఆ యన్ జీ వో మీదికి తన అధికారం అంతా ఉట్టిపడేటట్లు మందలింపు బాణాలు విసురుతాడు.]*

**ఆఫీసరు :**

ఏమయ్యా ! సుబ్బారావు
ఎప్పుడు వచ్చావు?
ఆఫీసా లేక ఇది
అత్తగారి ఇల్లా
    పదిన్నరకు ఆఫీసు,
    పదికే రమ్మన్నాను
    ఆదీ లేదు ఇదీ లేదు
    పదకొండై పోయింది.    ఏమయ్యా॥

ఉద్యోగం చేయాలని
ఉద్దేశ్యం లేదా ?
ఎంత చెప్పినా నీకు
సుంతైనా మతి లేదా? ఏమయ్యా॥

*(ఆ యన్ జీ వో ఏమి చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియని పరిస్థితిలో పడతాడు. తనను తాను కొంత సంబాళించుకొని, తడబడుతూ సంజాయిషీ చెపుతాడు.)*

## యన్ జీ వో :

ఏమని చెప్పాలండీ
ఇలా అడిగితే మీరు,
ఏమి చెప్పినా సిల్లీ
ఎక్స్ క్యూజ్ అంటారు
ఆకలి నూకల కోసం
మా యావిడ పంపింది
దిక్కులేని ఆ క్యూ లో
ఒక్క గంట గడిచింది ఏమ ॥
ఏడాది మా పాపకు
ఏదో జ్వరం పట్టింది
హాస్పిటాలు కెళ్ళిరాను
అదో గంట పట్టింది ఏమ ॥
అంతలో ఒకటవ తేదని
అప్పుల వాళ్లొచ్చారు
ఘాటు ఘాటుగా నాకు
నోటిసులు ఇచ్చారు ఏమ॥

*(చికాకుగా ఆ గొడవంతా విన్న ఆఫీసరు యన్ జీ వో కేసి అసహ్యంగా చూచి, తల తిప్పుకొంటాడు. బెడద తప్పించుకొని యన్ జీ వో అటెండన్సు రిజిష్టరులో సంతకం చేయబోతాడు. అంతలో....)*

## ఆఫీసరు :

బాగా చెప్పావు కాని
బాగు లేదు నీ పని
ఎన్ని సార్లు చెప్పాను
ఇంప్రూవు చెయ్యమని ?

పి. ఆర్ లు పెట్టలేదు
పెండెన్సీ తగ్గలేదు
పెట్టు మన్నరీతి నోటు
పెట్టు మంటె చేతగాదు బాగా ॥

ఈ ఫైల్ లో మ్యాటర్
ఎగ్జామిన్ చేయలేదు
జీ. ఓ. రెఫరె న్సేది ? బాగా ॥
డి. ఓ. రిమైండ రేదీ

ఏ దడిగిన నీ గొడవే
ఏకరువు పెడతావు
తోచదు నీ కేమొ, ఒరుల
చూచి నేర్చు కో లేవు బాగా॥

(మాటమాటకు యన్ జీ వో, యస్ సార్, సారీ అంటూ భయ భక్తులు ప్రకటిస్తాడు. ఆఫీసరుకు ఎదురు చెప్పలేని నిస్సహాయత వెలిబుచ్చుతూ వెళ్ళిపోతాడు.)

## రెండవ దృశ్యం :

(అది యన్ జీ వో ఇల్లు. అతడు అప్పుడే ఆఫీసు నుంచి వస్తూ ఇంటిలో ప్రవేశిస్తాడు — అటూ ఇటూ చూస్తే ఎవరూ కనిపించరు. ఓ మూలన పడిఉన్న కుర్చీలో కూర్చుంటాడు. అప్పుడు అతని భార్య చిరాకుగా లోపలినుంచి వచ్చి ఎగా దిగా చూస్తుంది. వాళ్ళ కుటుంబ సమస్యల పంచాంగం విప్పుతుంది.)

## యన్ జీ వో భార్య :

ఏ మండీ ! వచ్చారా
యన్ జీ వో గారూ
వచ్చి కూరు చున్నారు
మన అప్పుల వారు.
ఆఫీసు ఆఫీ సని
అలమటిస్తు ఉంటారా
ఇంటిదాని పోరు కాస్త
ఇవాళైన వింటారా. ఏమ॥
నెలలో తొలి రోజు నేడు
నెలసరి లెక్కలు చూడు
ఆదాయానికి ఖర్చుకు
అసలే కుదరదు జోడు ఏమ॥
ఆరు నెలల నుండి , ఇంటి
అద్దె కట్ట లేదు
పాలవాని పాతబాకి
పైసైనా ముట్టలేదు ఏమ॥
నేను క్రొత్త చీర కొనక
నేటికి రెండేండ్లాయెను
పిల్లలు సినిమాకు పోక
కల్లగాదు, నెల లాయెను ఏమి॥
ఈ సంసారం నేను
ఇంక చేయ లే నయ్యా !
తరగ కుండ పెరిగే ఈ
బరువు మోయలే నయ్యా ! ఏమ॥

*(కోపం రూపం దాల్చిన ట్లున్న తన భార్య చేతికి యన్ జి వో సుబ్బారావు తెచ్చిన జీతం అందిస్తాడు. ఆమె ఆగ్రహాన్ని కొంత ఉపశమింప చేయడానికి ఉద్యోగ వేదాంత సారం వినిపిస్తాడు.)*

## యన్ జీ వో :

ఒకటవ తేది గదా యని
హుషారుగా వచ్చాను
వచ్చిన జీతం అంతా
తెచ్చి నీకు ఇచ్చాను
        ఏమిటీ నేల నెలకూ
        ఇంక్రిమెంట్లు వస్తాయా
        ఏటా ఒకసారి వస్తే
        అదైన సరి గిస్తారా  ఒక॥
పిల్లలు పుట్టిన రీతి
పుట్టవు ఉద్యోగాలు
పిల్లలు పెరిగిన మాదిరి
పెరగవు మా జీతాలు  ఒక॥
        మంచి చెడు గ్రహించ కుండ
        మండి పడుట తగునా ?
        కాపుర మన్న తరువాత
        కష్టాలు ఉండవా ?

*(భర్త చెప్పిన సంజాయిషీని అంగీకరించక, ఆ యన్ జీ వో భార్య వ్యంగ్య వైభవమంతా వెల్లడిస్తూ, అతని పైకి కొరడా కొసలు విసురుతుంది.)*

## భార్య :

పిల్లలు కనుటే తప్పా
పెళ్ళాడుటయే ముప్పా
చేతగాని ఉద్యోగం
చేయకుంటె నే మాయెను ?
        నీతి యనీ నియమ మనీ
        వేతనాల నమ్ముకుంటే
        ఏ తీరున ఈద గలము
        ఈ సంసార సాగరం?

(ఏమి చేయాలో, తన బాధను ఎలా ఎరిగించాలో తెలియని సుబ్బారావు విచారగ్రస్తుడై గదిలో నుంచి బయటికి వెళతాడు – అతని భార్య నిర్ఘాంతంగా చూస్తుంది.)

## మూడవ దృశ్యం :

(విసిగి వేసారిన ఎన్ జీ వో సుబ్బారావు అడకత్తెరలోని పోక చెక్కలాగ ఉన్న తన జీవితాన్ని ఏకాంతంలో తలపోసుకుంటాడు. ఆయన మనస్సులోని మౌనవేదన అక్షర రూపం ధరిస్తుంది....)

## సుబ్బారావు :

ఇంటిదాని పోరేమో
ఇంతం తన రాదు
ఆఫీసరు చీవాట్లకు
అంతమేమొ లేదు

సంసారం చేయ లేక
చస్తుంటే ఒక వెపున
చార్జిమెమోలు, రిమార్కులు
సంజాయిషు లొక వైపున ఇంటి॥

నిజాయితికి కట్టు పడి
నేను బాధపడుట కంటె
అక్రమ మార్గాన నడచు
అన్యుల జత కూడుటయే
మంచిదేమొ యనిపించును
మనసేమో తపియించును ఇంటి॥

వేమన్నకు రామన్నకు
వినా ఎవరికీ తెలియదు
నా బాధలు నా గాథలు
నరకమైన సహించదు ఇంటి॥

(ఇంతలో, సుబ్బారావు పిల్లలు నాలుగు వైపుల నుంచీ అల్లరిచేస్తూ పరుగులు పెడుతూ వస్తారు. బాధాతప్తుడైన నాన్నను చూచి హఠాత్తుగా స్తంభించి పోతారు. అయినా, అమాయకత్వ మంతా ఉట్టి పడేటట్లు వాళ్ళు నాన్నను పలుకరిస్తారు.)

పిల్లలు :

నాన్నా ! నాన్నా ! వచ్చావా
మా కేమన్నా తెచ్చావా
బిస్కెట్లేవీ ? చాక్లెట్లేవీ ?
రంగుల బొమ్మలు తెచ్చావా ?
ని న్నెవ రేమ న్నన్నారా
కన్నీ రెందుకు మా నాన్నా
అదరి బెదరి చూస్తున్నావు
ఎదో కలగంటున్నావు నాన్నా ॥

(అప్పుడే ఇంట్లో నుంచి యన్ జీ వో భార్య పశ్చాత్తప్త వదనంతో ప్రవేశిస్తుంది. అమ్మను చూడగానే పిల్లలు గంతులేస్తారు....

అమ్మా అమ్మా రావమ్మా
ఇదుగో నా న్నొచ్చా డమ్మా !
(తండ్రిని ఉద్దేశిస్తూ) కానుక లెందుకులే నాన్నా
కథలేవైనా చెపు నాన్నా

(యన్ జీ వో భార్య తాను చేసిన పొరపాటు గ్రహిస్తుంది. భర్త మనస్సు కలత పెట్టినందుకు బాధపడుతుంది. భర్తను ఎలా అనునయించాలో తెలియని స్థితిలో పడుతుంది నెమ్మదిగా ఆమె జాలిగొంతుక వినివిస్తుంది....)

ఎంతటి పాపిష్టి దాన్ని
ఏడ్పించితి మిమ్ము
లేశమైన మీపై కసి
తే దంటే నమ్ము
ఇంటిలోని గొడవలలో
చంటి వాళ్ళ ఆల్లరిలో
వేగ లేక మీ మీద
విరుచుక పడ్డాను ఎంత ॥

మీ మంచి తనము మనకు
మేలు చేయు నెన్నటికి
రండి భోంచేయండి
రాత్రైపోతుందండి ఎంత ॥

*(తన భార్య పలికిన ప్రేమ వాక్యాలతో యన్ జి వో హృదయం కొంత ప్రసన్నమౌతుంది. భావిలో ఏదో కాంతి రేఖ ఆహ్వానిస్తున్నట్లు అతని ముఖం మీద చిరునవ్వు వెలుగుతుంది. కళ్ళల్లో ఆశారేఖలు తొంగి చూస్తుంటే - అతని భార్యా, పిల్లలు అతని చుట్టూ చేరుతారు - యన్ జి వో నిట్టూర్పు లేస్తూ ఉంటే.... ....)*

## 5 వ పద్యం :

బ్రతుకుబాధ చూచి నీవు
భయపడకోయ్ భాయీ !
కలదా ఎవ్వరి కైనా
కలత లేని హాయి ?

నీ కన్నా నా కన్నా
రెండింతలు కష్టపడే
సోదరుల పరిస్థితిని
చూచి తృప్తి పడవోయి ! బ్రతుకు ॥

కష్టాలకు గురియైనా
నష్టాలకు ఎరయైనా
నిజాయితిని విడకోయి !
నీకు భావి కలదోయి ! బ్రతుకు ॥

నిరుపేదల దేశం ఇది
నీ శ్రమ ఫలియించాలి
జాతి జాతకము మార్చే
చైతన్యము పెంచాలి ! బ్రతుకు ॥

# పిల్లలమర్రితో ఇంటర్వ్యూ

*[మహబూబ్ నగరానికి 2 మైళ్ళదూరంలో ఉన్న మహావృక్షం పిల్లల మర్రి. దాని వయస్సు 450 సంవత్సరాలు. అది ముదిమిలేని అందాల రాణి. సహస్రనిసర్గ సుందరవేణి. కవి ఆ పిల్లలమర్రిని దర్శించినప్పుడు కలిగిన అపూర్వానుభావానుభూతికి వచన కవితా రూపం ఈ రూపకం.]*

పిల్లలమర్రి : మనుష్యులతో మాట్లాడే కవీ !
మనస్సులతో మాట్లాడే సుకవీ !
నాకు నోరులేదనుకున్నావా ?
మాకు మనస్సు లేదనుకున్నావా ?
అచ్చంగా కవివట నీవు
ముచ్చటగా నాతో మాట్లాడవా?
నా మౌనవేదనలకు - నివేదనలకు
నీ నవభావనల మైకు
అమర్చి వినిపించవా !

కవి : పాడుతున్నా యనుకున్నాను
కల కంఠాలు
పలుకుతున్నా యనుకున్నాను
పక్షికంఠాలు
రాలుతున్నా యనుకున్నాను
ఎండుటాకులు
అంతేగాని
ఇవన్నీ నీ గొంతుక లనుకోలేదు
కొమ్మలలో దాగి ఉన్న
నీ కోరిక లనుకోలేదు

నిజం చెప్పాలంటే నిన్నటి దాక
నీ వింత గొప్పదాని వనుకోలేదు
పిల్లల మర్రీ ! ఒకసారి
నీ చల్లని కథ వినిపిస్తావా !
పచ్చని నీ బ్రతుకు మూటవిప్పి
నాలో ఊహల పచ్చలు కురిపిస్తావా !

పిల్లలమర్రి : ఏమని చెప్పను కవీశ్వరా !
నా ఎదలోని వింత బాధ
ఎలా వివరించాలి ఈశ్వరా !
నా శతాబ్దాల విచిత్ర గాథ -

ఈ దేశాన్ని ఇబ్రహింలోధి
ఏలిన కాలంలో
మహాపురుషుడు కబీరుదాసు వెల్గిన
పదిహేనవ శతాబ్ది అంతంలో
పవిత్ర కబీరు పంక్తులు
పాలమూరు వచ్చారు -
పాలమూరు సమీపంలోని
జైనల్లిపూరు గ్రామంలో నాడు
జిత్వా - నాత్వా అనే
బ్రాహ్మణ సోదరు లుండేవారు
అపూర్వ భక్తి సంపన్నులైన
ఆ అన్నదమ్ముల అతిథ్యానికి
అబ్బురపడ్డ కబీరు పంక్తులు
అయ్యా ! మీకు అర్హులైన గురువును
ఎన్నుకోవాలని సలహా ఇచ్చారు.
వెంటనే ఆ సోదరులజంట
మొండిబారి ఎండిపోయిన
ఓ దండిమర్రిని చూపించి
"ఈ చెట్టుకు ప్రాణం పోసిన వాణ్ని
గురువుగా స్వీకరిస్తాం మేం" అన్నారు -

కవి : చిత్రంగా ఉంది వాళ్లు పెట్టిన షరతులు
అయినా ఆ గొడవంతా ఎందుకు
అమ్మా ! నీ కథ చెప్పు
గుట్టుతెలియని, ఊహకందని
నీ పుట్టుపూర్వోత్తరాల ముడివిప్పు—

పి . మ : అదే చెపుతున్నా నయ్యా !
నా ఆత్మకథే ఇదంతా
వినండి — అసలు నా పుట్టకే
వింతల కొలక గిలిగింత —
ఆ తర్వాత కొన్నాళ్లకు
స్వయంగా కబీరుదాసే
జైనల్లిపూర్ రావటం తటస్థించింది
ఆ అపూర్వ సోదరుల
ఆతిథ్యాన్ని స్వీకరించటం సంభవించింది
ఎండి బండబారిన మర్రిచెట్టుకు
ఆయన
నిండుప్రాణం పోయటం జరిగింది
ఆ అమృత ఘడియలోనే కవీ !
నేను ఆవిర్భవించటం జరిగింది —

కవి : అద్భుతం అద్భుతం
నీ ఆవిర్భా వోదంతం
వినిపించు ఆకాశవాణిలా
నీ అమృతగాథ సాంతం.
ఎందుకలా నిట్టూరుస్తున్నావు ?
ఏమిటీ కంటతడి పెడుతున్నావు ?

పి . మ : చచ్చి బ్రతికిన
ఆ మర్రికొమ్మ నొకదాన్ని
పచ్చ పచ్చని నామూల దేహాన్ని
ఇక్కడే, ఈ సెలయేటి ఒడ్డున
చక్కని ఈ కొండచాలు పంచన
నాటి, నాకు ప్రాణం పోశారు
నీళ్లు కాదు
నిర్మల రాగ రసామృతం పోసి
నన్ను పెంచి పెద్దచేశారు

జీత్వా-నాత్వాలు
జైనుల్లాషా - అశ్రఫుల్లాషా లైనారు
వాళ్ల జీవితం నా కోసం ధారపోశారు
నా ఒడిలో నా నవ్వుల గుడిలోనే
కాలం గడిపి కన్నుమూశారు !
మతంతో ప్రమేయం లేని
మానవతా వాదులు వారు
మనీషులు మహర్షులు వారు
సమతాభావానికి
సుహృద్భావానికి
సంకేతాలుగా నా అడుగుజాడల్లో
సమాధులై పోయారు—

కవి : ఈ సమాధులు వారివేనా తల్లీ !
ఏం జరిగింది ఆపై, అనురాగవల్లీ !
నీ గాథా లహరిలో తేలిపోతుంటే
నిజం కలలాగుంది
ప్రేమ తరూ మతల్లీ !

పి . మ : ఎడారిలో ఒయాసిస్సులా
ఎన్నాళ్లో పడి ఉన్నాను
హబీబ్ మహ్మద్ అనే
అవ్వల్ తాలుఖదారు
నన్ను కొంత ఆదరించి
నా పంచలో బావి త్రవ్వించి
లోకంతో నాకు
సంబంధాన్ని పెంచే
చీకటిలో వెన్నెలలు ప్రసరించే
చక్కని రోడ్డు వేయించాడు !

కవి : నాలుగువందల యాభై సంవత్సారాల నీ వయస్సు
నాలుగు వందల యాభై వసంతాల నీ తపస్సు
మానవ నాగరికతా పరిణామంలో
ధరిత్రి చరిత్రలో
స్వర్ణయుగానికి సంబంధించినది -
గతకాల విశేషాల గురించి
చూడకుండా
చరిత్రకారులు వ్రాసిన చరిత్రల కంటే
కళ్లార చూచిన నీ నోట వినాలని
ఉల్లం కల్లోలినియై ఘోషిస్తున్నది -

పి . మ : ఎప్పుడూ చూస్తున్నవాళ్ళకు
ఏదీ మారుతున్న ట్లగుపించదు
అప్పుడప్పుడు వచ్చిపోయేవాళ్లకే
మార్పు రథచక్రాల జాడలగుపిస్తాయి.
అందుకే
అడపా దడపా వచ్చిపోయే
విదేశ నిపుణులు
మనదేశం గురించి

ఇచ్చే అభిప్రాయలకు
ఎంతో విలువ లభిస్తుంది -

శాంతి యాత్రలు-సమర యాత్రలు
జయాపజయాలు చూశాను
కుతుబ్‌షాహీలు పోయి
అసఫ్‌జాహీలు రావటం
గోలకొండ హైదరాబాదు కావటం
పాలమూరు
మహబూబ్‌నగరమై పోవటం
కళ్ళారా చూశాను నేను
స్వార్థంలో పరమార్థం కొంత
పరమార్థంలో స్వార్థం బోలెడంత
చరిత్రను దగ్గరగా చూస్తే
అతుకుల బొంత-
మహాత్ముల ప్రక్కలో మాయావులు
గులాబీల రెక్కల క్రింద కంటకాలు
లోకం
వెలుగు - చీకటి సహకార సంఘం
అయితే, క్రిందు మీదై, వెనకముందై
సమాజం పురోగమిస్తూనే ఉన్నది
అందుకే
నావంటి కానని కానల బ్రతుకులకు
అంతో ఇంతో ఆదరణ లభిస్తున్నది

కవి : తరువంశరాణీ ! నీకు
తోబుట్టువు లున్నారా ?
నిన్ను ప్రేమించిన ధీమంతులు
శ్రీమంతులు ఉన్నారా ?
నిన్ను అభిమానించే వాళ్ళు
స్తుతించేవాళ్ళు

నీకేమైనా మేలు చేస్తున్నారా ?
ఉపదేశాలు, ఉపన్యాసాలే
ఉపకారాలైన ఈ రోజుల్లో
నీకు ఉపయోగకరంగా
ఉండే దేదైనా చేస్తున్నారా ?

పి. మ : బుద్ధునికి జ్ఞానదానం చేసిన
బోధి వృక్షం గయలో
సిద్ధులకు సేదతీర్చే వట వృక్షం
చెన్నపట్నపు బీచిలో
ఉన్నారు నాకంటే ఎంతో పెద్దవారు
ఎన్నటికీ ఆరిపోని చరిత్రకలవారు -
చిన్నదాన్నే అయినప్పటికీ
మన్నించి నన్నెందరో చేరదీయటం,
జిల్లా పరిషదధ్యక్షులు
జిల్లా పరిపాలనాధ్యక్షులు
పురపాలక సంఘాధ్యక్షులు
పూజ్యులు, సుందరతాదిదృక్షులు
వాడిపోతున్న నా బ్రతుకులో
వాసంతం తేవా లనుకోవటం,
మరుగు పడిపోయే నా చరిత్రకు
మళ్ళీ ప్రాణం పోయటం,
నా శతాబ్దాల తపస్సుకు
ఫలమని భావిస్తున్నాను
నా కృతజ్ఞతలు నీ ద్వారా
వాళ్ళకందిస్తున్నాను -

కవి : ఎలా నీ బ్రతుకులో
వసంతం విరిసిందో
ఎలా నీ భావిలో ఆనందం కురిసిందో
వివరించవా నా గుండె సంకువై పోగా
వినిపించవా నా కర్ణాలు రసార్ద్రవాలై పోగా !

పి. మ: నా శాఖలు నరికి
నా జడ లూడబెరికి
నన్ను నిత్యం చిత్రవధచేసే
పసివాళ్ళ నుండి-పసుల కాపరుల నుండి
పాపం పుణ్యం తెలియని పశువుల నుండి
నన్ను రక్షిస్తానని
స్త్రీలపాలిటి కల్పతరువు
నా వంటి తరుల పోషించే (మి) స్త్రీ
ప్రభుత్వ పక్షంగా ప్రకటించటం
ప్రమోదం కలిగించింది నాకు;
ఆమె నా జీవితశాఖ శాఖకు
నవజీవం పోయడానికి
వినోదయాత్రికుల కోసం
నా అభిమానుల వసతి కోసం
నా ముంగిటిలో
శాశ్వత సుందర భవన నిర్మాణానికి
శంఖుస్థాపన చేయటం - నా భాగ్యం -
రంభోర్వశీ విలాసాలు స్ఫురించే
రసజగత్తులు కళ్ళముందు ప్రదర్శించే
లంబాడీ జవ్వనుల లాస్యాలు
నా ప్రాంగణంలో దీపాలు కావటం
నా సౌభాగ్యం—

కవి : ఊహిస్తున్నా నిప్పుడు
నీ ఉజ్జ్వల భావిజీవిత సౌధాన్ని
విరగని తరగని
వింతవింతల నీ కీర్తి భాండాగారాన్ని -
కళా తృష్ణలు
సుందరతా బృందారామకృష్ణులు
విజ్ఞాన శ్రీధరులు
కరుణాంతరంగులు

భావనా రాజ్యాధినేతలు
హసన్ముఖులు, అంతర్ముఖులు
నరులూ - నారాయణులూ
రాగజ్యోతిర్మయులు
రమ్యోషస్వినులు
నీ వటపత్ర తల్పాంతరాల కన్పిస్తున్నారు
నీ మౌనవచోధారల విన్పిస్తున్నారు
నీ సుందర స్వప్నాలకు
రూపం కల్పిస్తున్నారు -

పి.మ : గాలికెరటాల ఊయలలో
లీలగా జాలిగా నేను పాడే పాటల్ని
రాలే తూలిసోలే ఎండుటాకులమీద
రాగరేఖలతో నేను రాసే లేఖల్ని
ప్రజానాయకులు వినలేరని
పత్రికా రచయితలు చదువలేరని
ప్రకృతి కవీ! ప్రగతి రవీ!
నిన్ను నా చెంతకు
రా రమ్మని పిలిచాను
కాదు కాదు, నీ లోకన్నుల ముందు
నాకు నేనై వచ్చి నిలిచాను -

కవి : నిన్ను నేను తలచాను
నన్ను నీవు పిలిచావు
మన ఇద్దరి సమ్ముఖంలో
మానవ లోకానికి ఆవిష్కృతమైంది
నీ నవజీవన మహోదయం
నా నవ భావనార్ద్ర హృదయం.

(1970)

# చేతనా కేతనం

## (వచన కవితా రూపకం)

ఈ రూపకంలో భరత మాత, స్వాతంత్ర్యలక్ష్మి, భారత ప్రజ ఈ మూడు పాత్రలు. చేతనా కేతన చ్ఛాయల్లో, ఈ ముగ్గురూ ఆంతరంగిక సమావేశం జరుపుకుంటూ, నడుస్తున్న చరిత్రగురించి చర్చించుకోవటం ఇందులోని ఇతివృత్తం. ఈ అపూర్వ సమావేశానికి సూత్రధారుడు కవి. అతడుకూడ ఇందులో ఒక పాత్ర.

భరతమాత, స్వాతంత్ర్యలక్ష్మి భారత ప్రజ అనే మూడు ఊహా పాత్రలు. నిజానికి ఒకే శక్తియొక్క మూడు రూపాలు-అదే చేతనాశక్తి.

భరతమాత తరతరాల భారతీయ మూల చైతన్యానికి సంకేతం. ఆ శక్తిని ఈ తరంలో నడిపిస్తున్నది స్వతంత్ర జీవనాసక్తి - అదే స్వాతంత్ర్యలక్ష్మి. ఆ చేతనాశక్తి అసలు ప్రకటితమయేది ప్రజల ద్వారా-వాళ్ళ ఆశలలో, ఆశయాలలో, క్రియా కలాపాలలో. ఇక్కడ భారత ప్రజ అందుకే దేశంలోని నేటి చైతన్యానికి ప్రతిబింబం. ఈ ముగ్గురి సమావేశానికి సూత్రధారుడు కవి. అదిగో విచారగ్రస్తయైన భరతమాత సన్నిధిలో ప్రజాశక్తిని నిలిపి కవి తన కంఠం విప్పుతున్నాడు. .

### కవి

అమ్మా, భారతమ్మా !
ఆలోచిస్తున్నావేమి ?
మన స్వాతంత్ర్య లక్ష్మికి
పాతికేళ్లు నిండాయని
ప్రజాకోటి పండుగలు చేస్తుంటే

వీధుల్లో వేడుకలు జరుపుతుంటే
నీవు ఆనందంలో తేలిపోకుండా
అలా ఆలోచనల్లో మునిగిపోతున్నావేమిటి ?
అవ్యక్త చింతనా వేదనలను నీ కళ్ళు
వ్యక్తం చేస్తున్నాయెందుకు ?
వెలుగు నీడలమధ్య నీ విశాల హృదయం
నలిగి పోతున్నట్లున్నావెందుకు ?
తల్లీ, సకలదేశామతల్లీ !
అశేష భారత జనతాశాకిరణవల్లీ !

## భరతమాత

ఎవరయ్యా నీవు
అమృతం కురిపిస్తున్నావు
నా అంతరాంతరాళాల్లో
వింతగా ధ్వనిస్తున్నావు
ఎవరూ లేరని ఈ ఏకాంతంలో
ఏదో ఆలోచిస్తున్న నన్ను
ఎలా కనిపెట్ట గలిగావు ?
అన్నట్లు స్వాతంత్ర్యం ప్రసక్తి ఏదో తెచ్చావు
రజతోత్సవాల వేడుకల్లో అలసిపోయి
ఆమె కాస్త విశ్రాంతి తీసుకుంటున్నది
అలా నిలబడే ఉన్నావేమిటి
కూర్చో నాయనా
కులాసేగా అంతా-విశేషాలేమిటి ?

## కవి

కవినమ్మా, నేను కవినమ్మా
నీ కష్టసుఖాలను పాడుకొనే కవినమ్మా
స్వాతంత్ర్య భావ చైతన్య ధారలో

సాహితీ తరంగాలు పొంగించే కవినమ్మా
నిశాకుడ్యాలను చీల్చివేసే
ఉషాగీతికా స్పర్శతో
ప్రజాహృదయ పద్మాలను
మేల్కొల్పే రవినమ్మా, కవినమ్మా -

ఒంటరిగా రాలేదు
నా వెంట ప్రజావాహినిని తెచ్చాను
స్వాతంత్ర్య భవానితో వారిని
సమావేశ పరచాలని వచ్చాను-
మీరు ముగ్గురు చైతన్య మూర్తులు
భూత భవిష్యత్ వర్తమాన కర్తలు
నడుస్తున్న చరిత్రను సమీక్షించాలని
ప్రగతిపథంలోని అవరోధాలను తొలగించాలని
సవినయంగా మనవిజేయ వచ్చాను
సంధాన కర్తగా వచ్చాను
అమ్మా! స్వాతంత్ర్యలక్ష్మిని కూడ రమ్మనండి
నవభారత జనతాత్మ కథ వినండి

## భరతమాత

అదుగో అమ్మాయి స్వాతంత్రం రానేవచ్చింది
రా అమ్మా స్వాతంత్ర్యం రా
నీ మాటే మాట్లాడుతున్నాం
ఇదుగో ఈయన కవి
అదుగో ప్రజావాహిని
మనసువిప్పి మనతో మాట్లాడాలని వచ్చారట
ప్రగతి పట్ల మనకు కలుగుతున్న శంకలను తీరుస్తారట.

ఏదీ ప్రజలు మాట్లాడరేం ?
ఎలా ఉన్నారో ఏంచేస్తున్నారో చెప్పరేం ?
మంచుకొండల కంటే

మహానదుల కంటే
సాగరతీరాలకంటే
సాంద్రాటవుల కంటే
పైరులకంటే, పరిశ్రమల కంటే
మీరే నా ఆనంద దీపాలు
మీరే నా స్వప్నాలకు రూపాలు
నిజానికి మీ కోసమే అవన్నీ
మీ శ్రేయం కోసం కాకుంటే
ఎందుకు నా కివన్నీ!
మీ సమైక్యతాశక్తి, మీ దేశభక్తి
మీ అభ్యుదయానురక్తి
మీ శాంతి జీవనాసక్తి
నా అఖండ నిధులుగా భావించి
జీవిస్తున్నాను
ప్రస్తుతం మీ భవిష్యత్తు గురించే
ఆలోచిస్తున్నాను
చెప్పండి ప్రజలారా, మీ మనస్సులోనిమాట
విప్పండి జనులారా మీ ఆలోచనల మూట.

## ప్రజలు

కవిగారు చెప్పారు నీవేదో
కంటతడి పెడుతున్నావని
దేశ పురోగతి మార్గంలో
జాతి అభ్యున్నతి యాత్రలో
తిరోగాములు కొందరు గోతులు తీస్తున్నందుకు
స్వార్థపరులు కొందరు సంక్షోభం కల్గిస్తున్నందుకు
నీవు బాధపడుతున్నావని చెప్పారు కవిగారు
స్వాతంత్ర్యలక్ష్మి ఇంకా
సౌభాగ్యలక్ష్మి కాలేదని

ప్రగతికి పరమ శత్రువులైన పరాన్నభుక్కులు
ఇంకా పోలేదని నీవు పరితపిస్తున్నావని
స్వాతంత్ర్య యోధులు
సంఘ సంస్కర్తలు, స్వార్థ త్యాగులు
చెప్పుతుంటే
నిన్ను చూడాలని వచ్చాము తల్లీ
అన్నీ వివరించాలని వచ్చాము తల్లీ
నీ సందేశం విందామని
నీ పాదాలు మా ఎదల కద్దుకుందామని
తొందరపడుతున్నామమ్మా !
కర్తవ్యం ప్రబోధించుమమ్మా !

## భరతమాత

చూడండి ప్రజలారా
స్వాతంత్ర్య లక్ష్మిని
పాతికేళ్ళ బంగారుతల్లిని
మీ ఆరాధ్య దేవతామతల్లిని
ఆమె మహోదయంకోసం
కఠోరఘోర పారతంత్ర్య పారావారాలను
నిరంకుశ ప్రభుత్వ నిర్దాక్షిణ్య ఝంఝూమారుతాలను
దృఢాశయాల పడవలో
నవాశాజ్యోతుల వెలుగుల్లో
అధిగమించి జయించిన
స్వాతంత్ర్య సమరయోధులు
చాలామంది మనకు లేరీనాడు
ఈమె కరుణా కిరణోపవనాలలో
కనులు తెరచిన సుమాలు మీరు
కంటకావృత గులాబీలు మీరు
విద్యావిజ్ఞాన పరిమళోద్దీప్త

యువతరాలు మీరు -
స్వాతంత్ర్య లక్ష్మి అడుగవమ్మా
వీళ్ళు నిలుపుకున్న
ఆశలు, ఆశయాలేమిటో
కంటున్న స్వప్నాలేమిటో
సాధించిన విజయాలేమిటో
అడ్డొస్తున్న సమస్యలేమిటో
అడగవమ్మా!

## స్వాతంత్ర్య లక్ష్మి

తల్లి భారతి చెప్పినట్లు, ప్రజలారా
మీరే ఈ చల్లని దేశానికి మల్లెలు
దేశమాతనూ నన్నూ కీర్తిసౌధంలో నిల్పే
శౌర్య ధైర్య సాహసధీ వల్లులు
మీరే జాతి భవిష్యత్తు అధినేతలు
మీరే నా శాంతి సంపత్సముపేతులు
మీ మీదే ఎన్నో ఆశలు పెట్టుకున్నాను.
మీ చుట్టే
సౌభాగ్యస్వప్న సౌధాలెన్నో కట్టుకున్నాను
నేను పుట్టినరోజు పట్టరాని ఆనందంతో
మీరు పండుగ చేసుకున్నారు
నాకు మువ్వన్నెల తురాయి కట్టి
నా నుదుటిపై పవిత్ర రాజ్యాంగ తిలకం పెట్టి
మీ జీవిత మందిరంలో
నన్ను ప్రతిష్ఠించుకున్న నాడు, ఆనాడు
నేను కన్న కలలెన్నో ఇంకా నిజం కాలేదని
నేడు కలవరపడుతున్నాను -
మీ విజయాలు నా అదృష్టాలనీ
మీకు వివరించాలనే కుతూహల పడుతున్నాను
చెప్పండి ప్రజలారా, మీరు
చేస్తున్నదేమిటి? సాధిస్తున్నదేమిటి?
చెప్పండి -

## ప్రజలు

ప్రజాస్వామ్యమనే పందిరిమీద అల్లుకుపోయి
ఢిల్లీనుంచి పల్లెపల్లెలూ ప్రాకింది
స్వేచ్ఛా స్వాతంత్ర్య జీవన వల్లిక
ఇపుడిపుడే విరబూస్తున్నది ఇంటింటా
యువతా నవతా సమతాభావ పుష్పాలు
సామ్యవాద సౌరభాలు వెదజల్లుతూ
శాంతియుత విప్లవ గీతా లల్లుతూ.

## కవి

భలే వర్ణించారు ఒక్కముక్కలో
భరతావనిలో నేడు నడుస్తున్న చరిత్రనంతా
కవినైన నన్నే గిలిగింతలు పెట్టే
క్రాంతి చిత్రాన్ని
కళ్ళముందు నిలబెట్టారు
అదుగో! ఆ చైతన్య చిత్రం ముందు
భారతి ఆనందాశ్రువులు విడుస్తున్నది
నేలపై పడినీకుండా వాటిని దూసి
స్వేచ్ఛా లక్ష్మి దీక్షాశక్తి మాలగా ముడుస్తున్నది
ప్రజావాణి వినిపించగానే, ఆహా
ఎంతటి ప్రసన్నత వ్యాపిస్తున్నది -

## స్వాతంత్ర్య లక్ష్మి

బాగుంది కవికుమారా నీ వ్యాఖ్య
వ్యక్తిలా మాట్లాడుతున్నా నీతో
సంఘశక్తి ప్రవహిస్తున్నది
మనిషిలా ధ్వనిస్తున్నా నీతో
మహత్మ ఏదో నినదిస్తున్నది.

## ప్రజలు

వివరంగా విన్నవిస్తాం
వినండి మా వర్తమాన చరిత్ర
ప్రజాస్వామ్యం
శాంతి, సహకారం, సహజీవనం
అధికార వికేంద్రీకరణ
అభ్యుదయ ప్రణాళికా నిర్వహణ
కులాతీత మతాతీత సాంఘిక వ్యవస్థ
కూడు, గూడు, గుడ్డకు కొదవలేని ఆర్థిక వ్యవస్థ
లక్ష్యాలుగా, ఆశయాలుగా ఆదర్శాలుగా
ప్రయాణించాం పాతికేళ్ళు
ప్రగతిపథంలో, సమైక్యతా బలంతో-

సాగరాల పాలైన నదీజలాలను
నవజీవన సాగరాలుగా మలచుకొంటున్నాం
శక్తి సడలి కొండలోయల్లో కూలిపోయే
జలపాతాల జాలిగుండెలను తరచి
విద్యుచ్ఛక్తిని పండించుకొంటున్నాం

రాళ్ళూ ముళ్ళూ మానోళ్ళల్లో కొట్టిన బీళ్ళను
మా ఘర్మ గంగా జలంలో స్నానంచేయించి
పచ్చని విప్లవ పతాకలతో అలంకరించి
పల్లె పల్లెలోనూ
పట్టణాల ప్రాభవం వెలిగిస్తున్నాం

బండలు పగలగొట్టి
బంగారు కోటలు కడుతున్నాం
సుత్తెల మ్రోతల్లో
సురదుందుభులు పలికిస్తున్నాం

భూగర్భాలను శోధించి
భూరి భండారాలను నిర్మిస్తున్నాం
పాతాళపు లోతుల్లోనుంచి. పరిశ్రమలకు
ప్రాణం తోడిపోస్తున్నాం
దూరశ్రవణమూ, దూరదృష్టి ఆర్జించి
దూరభారాలు తగ్గించుకొంటున్నాం

వేగంగా ప్రగతి యాత్ర సాగిపోవటానికి
వేయిస్తున్నాం
లెక్కలేని రోడ్లు, ముక్కుసూటి రైలు బాటలు
కొండల్లాంటి ఓడలకు రేవులు
గండభేరుండాల్లాంటి విమానాలకు
ఆశ్రయాలు

తెచ్చుకోవటం కన్నా
యిచ్చుకోవటం ఎక్కువ నేర్చుకొంటున్నాం
సాధ్యమైనంతవరకు సంపదలను
సమానంగా పంచుకుంటున్నాం

నేలలో, నింగిలో సముద్రాలలో
నీ రక్షాదక్ష సైన్యాలను నిలబెట్టాం
శత్రు వెవడు చేయి చేసుకున్నా
శిరచ్ఛేదం తప్పదనే బెదురుపెట్టాం
ఈమధ్యే మీరు చూశారు గదమ్మా
ఈ వీరుల ధర్మవిజయ విహారాలు
మీరిచ్చిన ఆశీరక్షరవరాలు

## భరతమాత

విన్నావా స్వాతంత్ర్యలక్ష్మీ
వింతలూ విశేషాలూ
ఈ చేతనామూర్తుల వజ్రసంకల్పేందుబింబం
వర్షించిన వాక్సుధాశీకరాలలో
నీ సంతప్త హృదయానికి
శాంతి కొంత లభించిందా
చెప్పమ్మా చెప్పు, నీవేదో చెప్పబోతున్నావు

## స్వాతంత్ర్య లక్ష్మీ

అంత బాగానే ఉంది కాని, ప్రజలారా!
ఎంతోదూరం చేరలేదు మీరు
ఎన్నికలు జరుపుకొంటున్నారు
ప్రణాళికలు వేసుకొంటున్నారు
ఆదర్శాలకు, ఆశయాలకు
ఆకారం కల్పించడానికి
శాసనాలు చేస్తున్నారు
సభలూ, సమావేశాలూ, సమీక్షలూ
సక్రమంగానే సాగిస్తున్నారు
అయితే
నినాదాల ధూళికంబళి క్రింద
నిజం కొంత నిద్రిస్తున్నది
వివాదాల కటకటాల వెనుక
విజయం కొంత విలపిస్తున్నది

## కవి

కమనీయమైన మాటలతో
ఎంత కఠోర సత్యాన్ని ఆవిష్కరించావు
వెలుగు పావురాలను వేటాడే

చీకటి దేగల సంగతి
మల్లెపొదల మాటున దాగే
మిన్నాగుల సంగతి
వివరించి చెప్పు తల్లీ
ఈ జనకోటికి విదితమయ్యేటట్లు.

## స్వాతంత్ర్య లక్ష్మి

ఆశయాలతో అందరూ అంగీకరిస్తారు
ఆచరణలో మసిబూసి మారేడుకాయ చేస్తారు
స్వార్థంలో పరమార్థం ఉంటే సరే గాని
పరమార్థం స్వార్థానికి తోడ్పడకుంటే
విలయతాండవం చేస్తున్నారు మీ లోని
చిన్నన్నలు, పెద్దన్నలు
గమ్యం చేరాలని అందరూ నడుం కడుతున్నారు
ఆ గమ్యం ఏమిటో ఎవరికి వారే నిర్ణయించుకుంటున్నారు

మంచినీటి బావులవద్ద ఇంకా
మాల మాదిగ లనబడేవాళ్ళు
కడవల్లో, నీళ్ళు గాదు
కన్నీళ్ళు నింపుకుపోతున్నారు
ఆత్మాభిమానం వదులుకు పోతున్నారు
కులతత్వాల వలల్లో
విలవిల తన్నుకునే పక్షులను
విడిపించే పేరుతోనే కొందరు
ముడులు బిగిస్తున్నారు
వర్ణాంతర వివాహాలు
వక్తృత్వ పోటీలు దాటి, స్వేచ్ఛగా
వాస్తవికతా తీరం చేరటం లేదు -
గరీబీ హటావో అని
మీ కంఠం గుర్జిస్తుంటే

గరీబు హటావో అన్నట్లు
కొందరికి వినిపిస్తున్నది
మనిషికీ, దేవునికీ మధ్య
మార్గా లనుకున్న మతాలు
మనిషికీ దేవునికీ మధ్య
మంటలూ కంటకాలైనాయి
దేవుని సంగతి దేవుడెరుగు
మనిషి సంగతి ఎవడెరుగు ?

విద్యార్థులు విద్యాశాలల్లో చేరింది
చదువుకోవటానికా, సమ్మెలు చేయటానికా
అనే సందేహం కలుగుతున్నది
విద్యాశాలలను సమ్మెశాలలంటే
విశ్వసించటానికి వీలుగా ఉన్నది.

## భరతమాత

స్వాతంత్ర్య లక్ష్మి చెప్పిన మాట
సావధానంగా విన్నారు గదా
చేను చూచి సంతోషిస్తున్నారే గాని
చీడపురుగుల సంగతి విస్మరిస్తున్నారు
చేతనాభాండాలు మీరు నింపిపోతుంటే
చీకటి ఘూకాలు వాటికి చిల్లులు పెడుతున్నాయి
డెమొక్రసీని హిపోక్రసీ నడిపించాలని చూస్తున్నది
తోడేళ్ళు గొర్రెమందల కాపలా కాస్తున్నవి
డేగలు పావురాల వేషం వేస్తున్నవి
పెద్దల మనస్తత్వాలు మారటం లేదు
మాటల్లో మార్పే గాని మనసుల్లో మార్పు లేదు

దొంగలున్నారు జాగ్రత్త !
ఇంటిదొంగలున్నారు జాగ్రత్త !
చేతనా కేతనాన్ని
శిశిరం చేతికి చేరనీయవద్దు జాగ్రత్త !

ప్రజలు :

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మా కిచ్చిన
స్వచ్ఛంద వారసత్వ వసంతాన్ని
శిశిరచ్ఛాయల్లో పడనీయం
పాతికేళ్ళుగా ప్రగతి యాత్రలో
ప్రతిబంధకాలు పెడుతున్న
పన్నగాల పన్నాగాలు ఇక సాగనీయం
మనిషికి మార్గం చూపే
మానవతా రాడారును
మాయా రాకెట్ల దాడికి బలి కానీయం

తరచుగా మనమందరం ఇలా కలిసికొని
ఒకరి మనస్సుల్ని ఒకరు తెలిసికొని
మన అపూర్వ ప్రగతి ప్రస్థానంలోని
ప్రమాదాలను పసిగట్టుకొంటూ
చేతనాకేతనాన్ని ఎగరవేసుకుంటూ
అంతులేని కాలవిధుల్లో
ఆనందయాత్ర సాగిద్దాం
అఖిలావనికి భారతావని
ఆదర్శంగా జీవిద్దాం.

భరతమాత :

తథాస్తు తథాస్తు !

స్వాతంత్ర్యలక్ష్మి :

విజయోస్తు విజయోస్తు !
ప్రజాశక్తికి విజయోస్తు !
చేతనాశక్తికి దిగ్విజయోస్తు !

భరతమాత :

తథాస్తు తథాస్తు !

(1972)

# తక్కువే ఎక్కువ

(అధిక సంతానాపేక్ష గల భార్య, పరిమిత సంతానాన్ని కోరే భర్త మధ్య జరిగిన సంభాషణ—సన్నివేశం. ఈ నృత్య నాటికలోని ఇతివృత్తం. సన్యాసులు, యువతీయువకులు కూడ ఇందులో పాత్రలుగా వస్తారు. కుటుంబ సంక్షేమ తత్వాన్ని వ్యంజిస్తారు.)

**భార్య :**

కడుపునిండ సంతానం
కందామయ్యా !
భగవంతా నీదె భార
మందామయ్యా !

మా అమ్మ పదిమందిని కన్నది
పుట్టేటోళ్ళ నాపవద్దు అన్నది
ఎందరిని కంటే ఏ మున్నది
మంది ఎక్కువుంటే బలమన్నది. కడుపు॥

**భర్త :**

వద్దే వద్దే పిల్లలు
ఇద్దరి కంటెక్కువ
మన సంతతి సుఖపడాలి
మనకంటే ఎక్కువ-

బోలెడు పిల్లలను కని
జోలె చేతి కీయొద్దే
గంపెడు సంతానంతో
కొంపముంచు కోవద్దే. వద్దే॥

**భార్య :**

కాదు కాదు ఓరయ్యో !
కడుపునిండ సంతానం
కందామయ్యా
వద్దు వద్దు అని నీవు
అనవద్దయ్యా !

**భర్త :**

చందమామ వంటి బాబు
మందారం వంటి పాప
చాలే, పిల్లల కోడి
వోలె నీవు కావద్దే వద్దే॥

అపరేషను నీకు
ఆయాసము అనుకుంటే
నేనే చేయించు కుంట
నీవు అడ్డు పెట్టద్దే వద్దే॥

*(ఇంతలో ఇద్దరు సన్యాసులు వీధి వెంబడి వెళుతూ సంతాన తత్త్వం బోధిస్తూ పాట పాడుతుంటారు.)*

**సన్యాసులు :**

చక్కనైన శకుంతలకు
ఒక్కడే కుమారుడు
ఈ దేశం తన పేరున
నే వెల్గిన వీరుడు

ప్రేమ లెన్నో పుష్పించి
నోములెన్నో ఫలియించి
పుణ్య దంపతుల కడుపున
పుట్టినట్టి సోముడు — చక్కనై॥

ఇంతనాడె పులుల పట్టి
ఈడ్చిన భుజబలుడు
వెన్నతోనే విద్యల రుచి
గన్న బుద్ధి బలుడు — చక్కనై॥

కన్న వారికేమొ కీర్తి
కలిగించిన ఘనుడు
సుఖముగ తా బ్రతికి ప్రజల
సుఖపెట్టిన అనఘుడు - చక్కనై॥

తల్లికి ఒకరో ఇద్దరో
పిల్లలే వరాలు
భారతీయులంద రపుడు
భరతుని రూపాలు చక్కనై॥

### భార్య:

సన్యాసుల కేమి ఎరుక
సంతానం సంగతి
వాళ్ళమాట వింటుంటే
పోతుంది నామతి

శ్రీవారూ రావయ్యా!
చిన్న బోయినా వేల ?
సరసాలాడుదమయ్యా
చక్కని ఈ సంజవేళ. సన్యా॥

*(ప్రకృతి సౌందర్యంతో పరవశులై పోతున్న యువతీయువకుల జంటలు-ప్రణయ జీవులు-ప్రకృతి రహస్యాల ముడి విప్పుతూ పాడుతారు.)*

యువతి : కుహూ కుహూమని కూసే
కోకిల ఏమంటున్నది ?

యువకుడు : ముద్దుల సంసారానికి
ఇద్దరేను పిల్లలట - కుహూ-కుహూ.

యువతి : ఝుమ్మని ఝుమ్మని పాడే
తుమ్మెద లేమంటున్నవి ?

యువకుడు : ప్రణయ దంపతుల కడుపు
పంట ఇద్దరేనంట — ఝుం ఝుం.

యువతి : మిల మిల గగనంలోన
మెరయు తారలేమన్నవి ?

యువకుడు : చల్లనౌ కుటుంబానికి
సంతానం ఇద్దరట - మిల-మిల.

యువతి : చక చక తిరిగే కాల
చక్రము ఏమంటున్నది ?

యువకుడు : తల్లి ధరణి కనుల వెల్గు
తనయులు రవిచంద్రులట - చక-చక.

*(అప్పుడు ఆనంద పరవశులైన భార్యా భర్తలు- నాకాయి నాయకులు- కుటుంబ నియంత్రణ అనే అభ్యుదయ సూత్రాన్ని అంగీకరిస్తూ యుగళగీతం ఆలపిస్తారు.)*

భర్త : నా కున్నవి రెండే రెండు తెన్నులు
నను పిలిచే నను వలచే నీ కన్నులు

భార్య : నా కున్నవి రెండేరెండు వరాలు
నన్ను నిన్ను ఒకటిచేయు నీకరాలు

భర్త : నా కున్నవి రెండే రెండు పదవులు
మురిపించే మరిపించే నీ పెదవులు

భార్య : నా కున్నవి రెండే రెండు పువ్వులు
కనిపించే వినిపించే నీ నవ్వులు

భర్త : నా కున్నవి రెండే రెండు మేడలు
ఇరు సంజల నాలో గల నీ నీడలు

భార్య : నా కున్నవి రెండే రెండు బుక్కులు
ఆడించే పాడించే నీ వాక్కులు

ఇద్దరు : మన కున్నవి రెండే రెండు ఫలాలు
మన ప్రేమకు మన నోముకు ప్రతిఫలాలు.

(1977)

# ప్రజా విజయం

వేలాది వసంతాల ఉజ్జ్వల చరిత్ర, సంస్కృతితో వెలిగే స్వర్గ ఖండం మన భారత ఖండం. ఎన్నో దుష్టశక్తులు ఈ దేశంపై దండెత్తి ఓడిపోయాయి. భరత జాతి స్వాతంత్ర్య జీవనేచ్ఛను, సమైక్యతా బంధాన్ని భగ్నపరచడానికి ప్రయత్నించిన వారు మట్టి గరచి సమాధులైపోయారు. ఆ సమాధుల మీద నేటి సర్వ స్వతంత్ర ప్రజాస్వామ్య భారత పతాక రెపరెపలాడుతున్నది. సామ్యవాద పథంలో పంచవర్ష ప్రణాళికా రథంలో సాంఘిక ఆర్థిక విప్లవ భారతి ప్రయాణం సాగిస్తున్నది అడుగడుగున దారిద్ర్య పిశాచాన్ని అణగద్రొక్కుతున్నది.

భారత ప్రగతిని, స్వాతంత్ర్యాన్ని, సామ్యవాద వ్యవస్థను భంగ పరచడానికి స్వార్థం మోసం, ద్రోహం, ధ్వంసం అనే ప్రజాశత్రువులు చేస్తున్న కుతంత్రాలు విఫలమౌతున్నవి. ఈ నాలుగు దుష్టశక్తులు దోపిడీ, లంచగొండితనం, స్మగ్లింగ్, కల్తీలు చేయడం, అక్రమ నిలువలు మొదలైన అవినీతి అరాజక క్రియాకలాపాలతో జాతి సమైక్యతను, పురోగతిని విచ్ఛిన్నం చేస్తున్న వారందరికీ ప్రతిరూపాలు.

కర్షక, కార్మిక. యువజన. హరిజన, గిరిజన రూపంలో ఉన్న ప్రజాశక్తి ఈ దుష్టశక్తులపై విజృంభించి విజయం సాధిస్తున్నది. ప్రగతి లక్ష్మి ప్రజాశక్తిని నడిపిస్తున్నది. ఈ సన్నివేశాన్ని ఇతివృత్తంగా తీర్చిన కళారూపమే ఈ నృత్య రూపకం.

అదుగో చూడండి, దేశభక్తి దీపించిన ప్రజాశక్తి ఆనందహేల....

(తెర తీయగానే ప్రజాశక్తి దేశభక్తి గీతాలాపం చేస్తూ నర్తిస్తున్న దృశ్యం కనిపిస్తుంది - కర్షకులు, కార్మికులు, యువజనులు, హరిజనులు, గిరిజనులు మొదలైన బలహీన వర్గాలను ప్రతిబింబించే వేషాలతో వీలైనంత మంది స్త్రీ పురుషులు ప్రజాశక్తిగా పాల్గొనవచ్చు.)

## ప్రజాశక్తి :

ఈ దేశం మనదేశం
ఎంతో సుందర దేశం
ప్రపంచానికే కీర్తి
పంచిన భారతదేశం

ఈ నదులు మన ఎదలు
ఈ కొండలు మన కండలు
ఈ గనులు మన కనులు
ఈ అడవులు మన తొడవులు
ఈ పొలాలు మన బలాలు
ఇవి మన అందరికోసం
ఇది మన భారతదేశం — ఈ దేశం॥

వేదాలను పండించి
దురితాలను ఖండించి
నింగికి నేలకూ
నిచ్చెన వేసిన దేశం— ఈ దేశం॥

సామ్రాట్టుల ఓడించి
స్వాతంత్ర్యం సాధించి
సామ్యవాదం రథంపైని
సాగుతున్న ఘనదేశం ఈ దేశం॥

బుద్ధుడు పుట్టిన భూమి
గాంధీ మెట్టిన నేల
ఝాన్సి ఏలిన గడ్డ
జవహరు తీర్చిన దేశం ఈ దేశం॥

సంధివచనం : అంతా బాగానే ఉంది – కాని దేశంలో సాగుతున్న సాంఘిక, ఆర్థిక విప్లవాన్ని ఆపడానికి కొన్ని దుష్టశక్తులు విషవన్నాగాలు వన్నుతూ ప్రజాశక్తిని ముట్టడిస్తున్నాయి - చూడండి....

(భయభ్రాంతులు ప్రదర్శిస్తూ ప్రజాశక్తి, రంగంలో ప్రవేశించే దుష్టశక్తులను ఉద్దేశిస్తూ అంటుంది.)

ప్రజాశక్తి : అవును అవును అదుగో స్వార్థం
నిజమే నిజమే అదుగో మోసం
వచ్చేస్తున్నది అదుగో ద్రోహం
గర్జిస్తున్నది అదుగో ధ్వంసం

(అప్పుడు స్వార్థం, మోసం, ద్రోహం, ధ్వంసం అనే దుష్టశక్తులు తమ ప్రతాపాన్ని చూపుతూ రంగంలోకి ప్రవేశిస్తారు. వాళ్లు తమ ప్రవృత్తికి తగిన వేషాల్లో ఉంటారు. ఉమ్మడిగానూ, విడివిడిగానూ ఈ క్రింది చరణాలు పాడుతూ వికట నాట్యం చేస్తారు.)

దుష్టశక్తులు :

చక్కని పేరు పెట్టండంటే
స్వార్థం అంటారా నన్ను -
ముద్దు ముచ్చటగ పిలవండంటే
"మోసం" అంటారా నన్ను -
స్నేహం-శీలం అని అనమంటే
"ద్రోహం" అంటారా నన్ను -
దానం-ధర్మం నేనే నంటే
"ధ్వంసం" అంటారా నన్ను -

కర్షకులారా! కార్మికులారా!
కష్టంచేసే మానవులారా!
దేశం దేశం అంటున్నారా
దేశం మాదని తెలియగలేరా–

కష్టం మీకు, ఫలితం మాకు
చిక్కులు మీవి, హక్కులు మావి
నీడలు మీవి, మేడలు మావి
ఏద్రైతేనేం ఎవరైతేనేం
మీకూ మాకూ ఏమిటి భేదం
ఏక్కడ ఉంటది ఎలా ఉంటది
ఇంతకు మించిన సమతావాదం — చక్క॥

ఏరూపం ధరియిస్తుంటామో
ఎక్కడెక్కడా ఉంటుంటామో
ఎవరిని ఏమేం చేస్తుంటామో
ఎలా చెలామణీ అవుతుంటామో
తెలియదు మీకని తెలుసును మాకు
దేవుడు సైతం మాతాలూకు— చక్క॥

సంధివచనం : కామరూపులైన దుష్టశక్తులు ప్రజాకోటి శ్రమఫలాన్ని స్వాహాచేసి, దారిద్ర్య విషసర్పాన్ని పాలుపోసి పెంచి దేశం మీదికి వది లేశారు. నిరంతరం తమను నడిపిస్తున్న ప్రగతి లక్ష్మిని చేరి ప్రజాకోటి తమ బాధలను విన్నవించుకుంటున్నారు. దుష్టశక్తుల వ్యూహాలను ఛేదించి సమతా సౌభాగ్య సీమలకు త్వరితగతిని చేరుకొనే వెలుగు బాటలు చూపించుమని వేడుకుంటున్నారు - అదుగో ప్రగతి లక్ష్మి సన్నిధి చేరుతున్న ప్రజాశక్తిని చూడండి....

(ప్రగతి లక్ష్మి దివ్యావర్చస్సుతో రంగంలో వేంచేసి ఉంటుంది - ఇరువైపుల నుంచి ప్రజాశక్తి ఆమెను సమీపిస్తుంది.)

ప్రజాశక్తి :

అమ్మా, అమ్మా! మమ్ముల
ఆదరించవమ్మా !
చీకట్లను చెండాడే
శక్తినీయ వమ్మా !

విచ్చరవీగు అవినీతి
వెర్రితలలు వేస్తున్నది
జటిల దుష్టశక్తులెన్నో
జాతిని పీడిస్తున్నవి — అమ్మా॥

సంఘద్రోహం కట్టెను
సమాజసేవా వేషం
ద్వేషం వల్లిస్తున్నది
దేశభక్తి సందేశం — అమ్మా॥

రాచిలుకల వలె పలికే
రాబందులు వస్తున్నవి
ప్రతి పరిష్కారము ఒక
సమస్య చేసేస్తున్నవి — అమ్మా॥

*సంధివచనం : అమాయకులైన ప్రజల ఆవేదన గ్రహించిన ప్రగతి లక్ష్మి హృదయం కరిగి పోతున్నది. ప్రజాశక్తిని రక్షించాలనే దీక్షా వీక్షణం ఆమె కనులలో మెరసిపోతున్నది. దుష్టశక్తులను జయించడాని ఇరువై అంశాల పథకం అనే విజయ ధనుస్సును ప్రసాదిస్తున్నది. దాని ప్రయోగాన్ని, ప్రయోజనాన్ని ప్రజాకోటికి వివరిస్తున్న ప్రగతి లక్ష్మిని చూడండి........*

*(ప్రక్కలో కొంచెం కనుమరుగుగా పెట్టిన ధనుస్సును బయటికి తీస్తుంది లక్ష్మి.)*

ఇదుగో! ఇదుగో! విజయధనుస్సు
ఇరువై అమ్ముల మేటి ధనుస్సు
ఇదే ఇదే మీ శక్తి ధనుస్సు
ప్రజలారా! మీలోని మహస్సు

కోటి కోటి కోదండబలమ్ము
మేటి మేటి గాండీవజవమ్ము
నింగిని నేలను కదిపే చాపం
నిండిన రిపుగణఖండన చాపం ఇదుగో॥

సత్యం నారులు సారించాలి
శివం శరాలు సంధించాలి
సుందర మెల్లెడ వ్యాపించాలి
చీకటులన్నీ నశియించాలి — ఇదుగో॥

ఇంటా బయట దాగిన శత్రుల
ఎదిరించాలి ఎక్కడి కక్కడ
కలుపు తీయనిదే కాపు లేనిదే
ఫలియించదుగా ఏచేనైనా ఇదుగో॥

*(ప్రజాశక్తి, ఆ ధనుస్సును స్వీకరిస్తుంది. అది ఒకే ధనుస్సు కావచ్చు. ఒక్కొక్కరికి ఒక ధనుస్సు కావచ్చు. వారు నిష్క్రమిస్తారు. మరో వైపు నుంచి దుష్టశక్తులు విజృంభించి రంగం మీదికి ఇంకా వికృతాకారాలతో ప్రవేశిస్తాయి.)*

సంధివచనం : *ప్రజాశక్తిని వంచించడానికి దుష్టశక్తులన్నీ ఏకమైనాయి. వికృతాకారాలతో వికృతాలోచనలతో అవి సమాజం మీద ఎలా విరుచుక పడుతున్నాయో చూడండి....*

## దుష్టశక్తులు :

ఎదురులేదు బెదురులేదు
ఇక మనదే రాజ్యం
నీతి, న్యాయం, ధర్మం
నిత్యం మన భోజ్యం
పల్లెలలో పట్టణాల్లో
కల్లోలం లేపేద్దాం
ప్రజాశక్తి దేశభక్తి
ప్రగతిని ఆపేద్దాం — ఎదురు॥

సంధివచనం : విజయ ధనుస్సును ఎక్కుపెట్టిన ప్రజాశక్తి దుష్టశక్తుల ప్రగల్భాలకు బెదరక వాటిని ఎదిరిస్తున్నది. క్రాంతి యాత్ర సాగిస్తున్నది - అదుగో........

ప్రజాశక్తి :

సాగవింక సాగవింక
స్వార్థమా నీ ఆటలు
నమ్మమింక నమ్మమింక
మోసమా నీ మాటలు
పాడకింక పాడకింక
ద్రోహమా నీ పాటలు
చాలించుము చాలించుము
ధ్వంసమా నీ వేటలు
అరాజకం గాలివాన
అలజడుల బురద బెడద
పెట్టలేరు మమ్ము హింస
పెట్టలేరు మీరింకా — సాగ॥

ప్రజాశక్తి-కర్షకులు : దున్నేవాడిది భూమి
దోపిడీది మరుభూమి
నీతిగలాడే స్వామి
శ్రమశక్తికి నమామి
అని పాటలు పాడుతున్న వదుగో
కొమ్మల్లో దాగుకున్న కోకిలలు
కోనల్లో మేలుకొన్న శిలలు — సాగ॥

ప్రజాశక్తి-కార్మికులు : ఫ్యాక్టరీలు మందిరాలు
ప్రాజెక్టులు వేదాలు
క్రమశిక్షణ దైవభక్తి
ఉత్పత్తే మంత్రశక్తి
మనిషే మనిషికి దైవం

మనదేశం మనస్వర్గం
అని ఆలపిస్తున్నవి అదుగో
మాటలాడ నేర్చినట్టి పువ్వులు
మార్పుకు స్వాగతం పట్టు దివ్వెలు సాగ॥

ప్రజాశక్తి-బలహీన వర్గాలు : కులతత్త్వం మతకలహం :
క్రుళ్ళిన ఆచారాలు
పెంచి ఈ సమాజాన్ని
వంచించగ లేరు మీరు
కనపడలేదా నింగిని
ఇరువై రంగుల సింగిణి
మేము ఎక్కుపెట్టినట్టి
మేటి విజయధనుస్సు — సాగ॥

ప్రజాశక్తి-యువజనులు :
సరసమైన ధరలకే
సరకులు అమ్మిస్తాము
అత్యవసర వస్తువులు
అందరికీ పంచుదాం
కూడు, గూడు. గుడ్డకు
కొరత తీర్చి వేస్తాము
నిరుద్యోగ పిశాచిని
నిలువున పాతేస్తాం — సాగ॥

సంధివచనం : *ప్రజాశక్తి దృఢదీక్షా సంకల్పాలకు దుష్టశక్తులు గజగజలాడి పోతున్నాయి. వాళ్లు పన్నిన వలలన్నీ పటాపంచలై పోగా తమ ఓటమిని ఒప్పుకుంటున్నారు చూడండి........*

## దుష్టశక్తులు :

చిత్రంగా ఉన్నదే
చీకటి పోతున్నదే
ప్రజాశక్తి వెలుగెంతో
ప్రచండంగ ఉన్నదే

ఇరువై అమ్మల మేటి
విజయ ధనుస్సేమిటి!
మట్టి, మ్రాకు, రాయి రప్ప
మాట్లాడుట ఏమిటి! — చిత్ర॥

నవ్వుల పువ్వుల దాచిన
నాగుల పసిగట్టారు
పిట్టకైన తెలియని మన
గుట్టులు కనిపెట్టారు — చిత్ర॥

కర్షకులూ, కార్మికులూ
హరిజనులూ, గిరిజనులూ;
యువజనులూ, విద్యార్థులు
నవసమైక్యతా శిఖలై
మనపై దండెత్తినారు
మనలను ఓడించినారు
మన అంతం చూచినారు — చిత్ర॥

సంధివచనం : దుష్ట శక్తులను అంతంచేసి ఆనందోత్సాహాలతో విజయోత్సవం జరుపుకుంటున్న భారత ప్రజాకోటి అదుగో........

(ఒక వైపు నుంచి దుష్టశక్తులు తలలు వ్రాల్చి నిష్క్రమిస్తాయి. మరో వైపు నుంచి ప్రజాశక్తి రొమ్ము విరుచుకొని రంగం మీదికి ప్రవేశిస్తుంది.)

ప్రజాశక్తి :

ప్రజాశక్తి : బంజరు భూములు పంచారు
బ్రతుకు బాట చూపించారు
భూకమతాలకు మితిపెట్టి
మిగులు భూములను పంచారు

ఏమీలేనీ పేదవారికి
ఎవ్వరు కానని హరిజనాళికి
అడవుల నుండే కొండవారికి
అరకబట్టగల కూలివారికి — బంజరు॥

ఎరువులకోసం ఎద్దులకోసం
అప్పులు కూడా ఇప్పించారు
చిన్న రైతులు మిన్నగచేసే
సేద్యపురీతులు చెప్పించారు — బంజరు॥

వేతనాలు సరిచేయించారు
వెట్టిచాకిరీ మాన్పించారు
వేత మొగ్గములు పెట్టించారు
జాతికి దీపం ముట్టించారు — బంజరు॥

ఆస్తిపాస్తులకు హద్దులు పెట్టి
సమతా జీవన వారధి కట్టి
భారతజాతి ప్రగతి లక్ష్మికి
బంగరు కోటలు కట్టించారు — బంజరు॥

వృత్తికారులకు పని చూపించి
ఉద్యోగాలను అంతట పెంచి
ఆర్థిక నేరస్తుల శిక్షించి
సామ్యవాదమును పోషించారు — బంజరు॥

సంధివచనం : ప్రజా విజయాన్ని చూచి ప్రగతి లక్ష్మి మురిసిపోతున్నది. జనకోటికి, అసుర శక్తుల మీద అఖండ విజయం కలుగుతూనే ఉండాలని ఆశీర్వదించడానికి ఆ తల్లి మళ్లీ ప్రత్యక్షమౌతున్నది.....

(విజయహాసం చిందుతూ అభయహస్తం చూపుతూ ప్రగతి లక్ష్మి రంగం మీదికి వచ్చి ప్రజాశక్తిని ప్రబోధిస్తుంది. ప్రజాశక్తి ఆమె చుట్టూ నర్తిస్తుంది )

## ప్రగతిలక్ష్మి :

ప్రగతి లక్ష్మి : విజయం మీదే విజయం మీదే
వీరభారత ప్రజలారా!
ఇరువై అమ్ముల విజయ ధనుస్సును
ప్రయోగించిన ప్రభలారా!

ఆగకుండ ఈ పుడమి బొంగరం
గిరగిర తిరుగుతు ఉంటుంది
వెలుగుచీకటికి మధ్య సంగరం
ఆగుతు సాగుతు ఉంటుంది – విజయం॥

జాగరూకతే జాతికి రక్ష
క్రమశిక్షణయే క్రాంతికి రక్ష
దృఢసమైక్యతే దేశపు రక్ష
దనుజశక్తులకు తప్పదు శిక్ష – విజయం॥

చైతన్యమే చక్రం మీకు
దేశభక్తియే శంఖం మీకు
నీతి నిజాయితీ దైవం మీకు
మీ విజయమ్మే ఊపిరినాకు – విజయం॥

కామరూపులు కాంతిశత్రువులు
పరాన్నభుక్కులు ప్రజాశత్రువులు
దాగిపోవుదురు వీగి పోవరో
వచ్చిపోవుదురు చచ్చిపోవరో – విజయం॥

ఇరువై అమ్ముల విజయ ధనుస్సు
ఎక్కుపెట్టియే ఉంచాలి
భారతజాతి ప్రగతిపతాక
యుగయుగాలు నర్తించాలి – విజయం॥

(తెరపడుతుంది)

(1976)

# స్వాతంత్ర్య హేల

ప్రాచీన సంస్కృతికి నిలయం అయిన భారతీయ జీవన విధానం ప్రగతి శీలకమైంది. కాలానుగుణంగా తన మనుగడను తీర్చిదిద్దుకునే సాంప్రదాయం భారతీయ తత్వంలో ప్రతిబింబిస్తుంది. విదేశ దండయాత్రలకు, పర ప్రభుత్వ పరిపాలనకు లోనైనప్పటికీ ఈ భూమిలో ఎన్నో స్వాతంత్ర్య విప్లవాలు పండినవి. ఛాందస భావాలకు ఎరయైన భారతీయులే శాస్త్ర విజ్ఞాన సందీప్తులై సజీవ చైతన్య సమాజానికి స్వాగతం పలుకుతున్నారు.

స్వతంత్ర భారత దేశంలో ఒక శాంతియుత విప్లవం వ్రేళ్ల తన్నుకుంటున్నది. త్యాగదీక్ష, సామ్యవాద స్పృహ ఒక వైపు వికసిస్తుంటే, స్వార్థపరత్వం, సంకుచితత్వం మరొకవైపు వికటహాసం చేస్తున్నవి.

వాస్తవ పరిస్థితులకు ఆశావాదులు, నిరాశావాదులు ఎలా ప్రతిస్పందిస్తున్నారో దేశమాత స్వాతంత్ర్యలక్ష్మి వారి నెలా ప్రగతి పథంలో నడపడానికి ప్రబోధిస్తున్నారో చూపడానికి, చేసిన కళాత్మక ప్రయత్నం ఈ గేయ రూపకం. అందరూ త్రికరణ శుద్ధితో కలిసి పని చేస్తే ఈ దేశ భవిష్యత్తు సముజ్జ్వల రూపం దిద్దుకుంటుంది అనే భావన ప్రజలలో కలిగించడమే ఈ రూపక లక్ష్యం.

ఇందులో నేపథ్య కంఠంతో పాటు ఆశావాదులు, నిరాశావాదులు, భరతమాత, స్వాతంత్ర్యలక్ష్మి పాత్రలుగా వస్తారు. వీరు భావ ఘర్షణకు ప్రతీకలు. అదుగో స్వేచ్ఛా సందేశాన్ని వెదజల్లే నేపథ్య కంఠం.

## నేపథ్యం :

అందరు పాడే పాటొకటున్నది
అదియే స్వేచ్ఛాగానం
అందరి నీడై తోటొకటున్నది
అదియే భారత దేశం——

గంగా ఝరిలో
గోదావరిలో
పొంగే అఖండగానం
జాతికి స్వేచ్ఛా ప్రాణం— అందరు॥

హిమగిరి గళమున
హిందూ జలనిధి
వినిపించే సందేశం
విక్రమ భారత దేశం— అందరు॥

అంబాలాలో
అగరతలాలో
స్వనించు దేశభక్తి
స్వతంత్ర భారత శక్తి అందరు॥

*స్వతంత్ర భారత దేశంలో ప్రజాస్వామ్య పథం మీద, సామ్యవాద రథం మీద ప్రగతి లక్ష్మి ప్రయాణిస్తున్నది. ఎన్నెన్నో ఆశలను ఆశయాలను, ఎడతెగని స్వప్నాలను, ఎనలేని విజయాలను భరత జాతికి అందిస్తున్నది. పురోగమన శీలురైన ఆశావాదులు ఆనందోత్సాహాలతో ఆశాగీతం ఆలపిస్తున్నారు.*

**ఆశావాదులు :**

ఇది మన భారత దేశం
ఇది మన అందరి దేశం
కలలు పంటలై పండే
కర్మభూమి ఈ దేశం—

ఈ మట్టిని ప్రేమిస్తే
మణులు దొరలి పడుతాయి
ఈ రాలను సేవిస్తే
సుధలు ఒలికి పడుతాయి— ఇది మన॥

ఇటువెలసిన ప్రతి ఊరు
చరిత్ర భాండాగారం
మన జీవనాడుల్లో
విజయనాద మీ దేశం ఇది మన॥

మన కన్నుల మనగుండెల
వెలుగు పెక్కొ మీ దేశం
ఇట వెలిగిన ప్రతి మనిషి
పురా సంస్కృతీ సారం— ఇది మన॥

*ఆశయాలతో ఆచరణను, కలలతో వాస్తవాలను కొలచి నిరాశ పడుతున్నారు కొందరు. ఇతర దేశాలతో, ఇతర సమాజాలతో మన జీవన పరిస్థితుల్ని పోల్చుకొని నిరుత్సాహ పడుతున్నారు మరికొందరు. సమస్యాల వలల్లో చిక్కుకొని విలవిల లాడే వారి భావవిహంగాల వేడి నిట్టూర్పులు ఇలా ఉన్నాయి.*

## నిరాశావాదులు :

ఏమి సాధించాము
మనము ?
ఇది ఏమి ప్రగతి
జీవనము ?

స్వాతంత్ర్య మేమి చేస్తున్నది ?
స్వార్థ పరతకు ఎదురౌతున్నది
అభివృద్ధి ఏమి అవుతున్నది ?
అసమానతకు బలౌతున్నది ? ఏమి॥

మట్టి దున్నేవారు ఒకరు
మణులేరుకొనువారు ఒకరు
రాళ్ళతో పోరాడు నొకడు
రతనాల తులతూగు నొకడు:— ఏమి॥

దేశభక్తికి నీడ లేదు
నీతి శక్తికి గూడు లేదు
పరదేశ భక్తికే ప్రగతి
అవినీతి శక్తికే సుగతి — ఏమి॥

*ఏ దేశంలో జరిగే ప్రగతికైనా పరిణామాలకైనా ఆ దేశ ప్రజలే, కారకులు. వారి సమష్టి కృషి ఫలితాలే వారి విజయాలు. అందుకే మన జయాపజయాలు మనవి. మన మంచి చెడుగులకు మనమే బాధ్యులం. దేశాన్ని ప్రేమించి మానవతా వాదాన్ని త్రికరణశుద్ధితో పాటించినపుడే మన సమస్యలు తీరిపోతాయి; మన స్వాతంత్ర్యం సార్థకమవుతుంది అంటు న్నారు ఆశావాదులు.*

## ఆశావాదులు :

ఒరులను నిందించకు, నీ
విధిని విస్మరించకు
చేతగానితనమును
చేతనగా రూపించకు —

మట్టికి స్వార్థము లేదు
మ్రానుకు స్వార్థము లేదు
మనిషికున్నంత స్వార్థం
మరిదేనికి లేదు— ఒరులను॥

నీ దేహముకన్న మిన్న
నీ దేశము ప్రేమించుము
నీ కుటుంబమున కన్నా
లోక మెల్ల పోషించుము — ఒరులను॥

ఇడుములు లేనట్టి జాతి
ఈ భువిలో ఎందున్నది ?
కష్టనష్టములు లేనిది
సృష్టిలోన ఏమున్నది ?— ఒరులను॥

మంచి చెడుగులకు బాధ్యత
మనదే, మనదే, మనదే !
స్వాతంత్ర్యానికి రక్ష
సమతాయుత సమైక్యతే— ఒరులను॥

*ఆశావాదులూ, నిరాశావాదులూ, పేదలూ, ధనికులూ అందరూ తన అనుంగు బిడ్డలే భరతమాతకు. వారంతా ఒక్కటై సర్వజనానంద సమతా పథంమీద సాగిపోవాలని ఆమె ఆకాంక్ష. అందుకే స్వాతంత్ర్య ప్రణీత దేశమాత తన ఆత్మను శ్రుతి చేసింది.*

## దేశమాత :

స్వాతంత్ర్య ప్రియులారా
నా తనయులారా
ఆశాయుతులారా
నిరాశాహతులారా

మీ ఆశలు ఆశయాలు
నా జాతక రేఖలు
మీ జయాపజయాలు
నా జీవిత శాఖలు— స్వాతంత్ర్య॥

మీ సమైక్యతా బలమే
నా సుందర రూపము
మీ సమతా భావనమే
నా సుయశోదీపము — స్వాతంత్ర్య॥

మీ పవిత్ర క్రాంతియాత్ర
కాంతి రథమ్మున సాగి
ఎవరు వెనుక పడకుండా
ఏకధాటి కదలాలీ— స్వాతంత్ర్య॥

ప్రగతి యాత్రలో సాధించిన విజయాలను స్వాతంత్ర్యలక్ష్మి స్మరిస్తున్నది. సంకల్పబలం ఆశయశుద్ధి ఉంటే సాధించజాలనిదేదీ లేదని ప్రవచిస్తున్నది.

## స్వాతంత్ర్య లక్ష్మి

నా దేశం నవ్వుతోంది
నందన వనంలా
నా దేశం నవ్వుతోంది
నాద స్వరంలా

కడలి కలిసి పోయినట్టి
నదీ నదాలన్నీ
పల్లె పల్లెలో పొలాల
పాటపాడుతుంటే నాదేశం॥

గనిలోని బొగ్గుముక్క
వనిలోని నీటిచుక్క
వెలుగు వాకలై విప్లవ
వీధుల విహరిస్తుంటే నాదేశం॥

మట్టి మాటలాడు తూంటె
రాయిరప్ప పాడుతోంటె
ప్రజాశక్తి చూచి ఇరులు
పారిపోతుంటే నాదేశం॥

కర్షకులూ, కార్మికులూ
క్రాంతి కథా నాయకులై
నేను కన్న కలలన్నీ
నిజాలు చేస్తుంటే నాదేశం॥

ఎవరేది చెప్పినా నిరాశావాదులకు ఇంకా మన స్వాతంత్ర్య శక్తి మీద, ప్రగతి పథకాల పాటవం మీద పరిపూర్ణ విశ్వాసం కలిగినట్లు లేదు.

స్వేచ్ఛాగగనంలో పొంచిఉన్న చీకటి మబ్బుల్ని, అభ్యుదయోద్యానంలో దాగిఉన్న దుష్టనాగుల్ని గురించి ఆందోళన, ఆవేదన వ్యక్త్యం చేస్తున్నారు. నవభారత నిర్మాణ యజ్ఞంలో పాల్గొంటున్నవారి చిత్తశుద్ధిని కూడ శంకిస్తున్నారు.

## నిరాశావాదులు :

వెలుగు పావురాలవెంట
వింత డేగ లవిగో !
క్రాంతి మల్లె పొదలలోన
కాలనాగు లవిగో !

ప్రతిభకు గుర్తింపు లేదు
పలుకుబడికి తప్ప
త్యాగానికి మెప్పులేదు
స్వార్థానికి తప్ప —వెలుగు ॥

కష్టపడేటి వారికేమొ
కడుపు నిండదాయె
దోపిడీ దొరల కెంతకు
తృప్తి కల్గదాయె —వెలుగు ॥

పేరు పేదవారిదాయె
ఊరు పెద్దవారిదాయె
ఎచట చూచినా గాని
హిపక్రసీ నాట్యమాయె —వెలుగు ॥

అవును, దేశంలో అనేక సమస్యలున్నాయి. వెలుగుచీకటులకు మధ్యపోరాటం సాగుతునే ఉంటుంది. దుష్టశక్తులు ప్రజాశక్తిని, ప్రగతిశక్తిని ఆపలేవు. వాటికి విజయం తప్పదు. నిర్భయంగా ముందుకు సాగిపోవాలనేదే ఆశావాద దృక్పథం.

## ఆశావాదులు :

చెడును చూచి భయపడుట
చేతగాని తనము
ముళ్లున్నాయని పూవుల
మొక్క పూయకుండునా ?

స్వార్థానికి లొంగిపోయి
త్యాగధనము వీడకు
మోసానికి తోడునిల్చి
ప్రోడుబారి పోవకు చెడును ॥

మనిషి మనిషి మారుతుంటె
మారిపోవు సమాజం
విలువలు ఒకటొకటి మారి
వెలిగించును విప్లవం చెడును ॥

*భావగతులు మారుతున్నాయి నిరాశావాదుల కళ్ళలో నవాశా జ్యోతులు విరుస్తున్నాయి. భారత స్వాతంత్ర్య రక్షణకు, అఖిల భారత అఖండ ప్రగతికి అందరూ సమైక్య దీక్ష పూనుతున్నారు. అందరి ఆశయం ఒకటే - అందరి ఆదర్శం ఒకటే - సంపూర్ణ సమాజ కళ్యాణం - సర్వ మానవతా వికాసం.*

## నేపథ్యం :

మన దేశం మారింది మారింది
ప్రగతి నౌక గమ్యం దరి చేరింది.

బక్క రైతు కూలీలను
బంజరు భూములు వలచె
పేద వడిన సీమలలో
పరిశ్రమలు ప్రభవించె మన దేశం ॥

శ్రీ దేవికి ప్రియమయ్యేను
పేదవారి లోగిళ్లు
వాగ్దేవికి నెలవయ్యేను
నోరులేని పల్లెటూళ్లు — మన దేశం ॥

ప్రాలు మాలి కడలిలోన
పడిపోయిన నదులన్నీ
ఆకొన్న పొలాలు చేరి
అమృతం పండిస్తున్నవి. — మన దేశం ॥

ప్రగతి ప్రణాళికలు వేసి
ప్రజలను పాలకులు చేసి
దేశలక్ష్మి ఇంటింటికి
దీపంగా వెలిగింది — మన దేశం ॥

# సకలజన సంక్రాంతి

[తెలుగువారి పెద్ద పండుగ సంక్రాంతి. అది తమ జీవితాలకు నూతన కాంతిని, శాంతిని ప్రసాదిస్తుందని అందరూ ఆశిస్తారు. పండుగ వచ్చిందని కొందరు పరవశించి పాడుకుంటారు - మరి కొందరు బాధలను నివేదించుకుంటారు. "సంక్రాంతి"తో ఆశ, నిరాశలు జరిపే ఆత్మాభిభాషణమే ఈ సంగీతరూపకం. ప్రజావాణి, ఆశ, నిరాశ, సంక్రాంతి ఇందులో పాత్రలుగా వినివిస్తాయి.]

ప్రజావాణి :

ఏది కాంతి
ఏది శాంతి
ఏది మకర సంక్రాంతి
ఏటేటా మరువకుండా
ఏతెంచే జయంతి

ఆసేతు హిమాచలం
ఆవరించు విక్రాంతి
అందరి డెందాలను
అలరించే వాసంతి
ఏటేటా మరువకుండా
ఏతెంచే జయంతి ! - ఏది ....

సందేహాలను తీర్చే
సందేశం కొనితెచ్చే
మాయమంచు తెరలపైన
మండిపడే హేమంతి
ఏటేటా మరువకుండా
ఏతెంచే జయంతి— ఏది ....

# సంక్రాంతి

నేనే సంక్రాతిని
నేనే హేమంతిని
నవశాంతిని యువకాంతిని
భువి నిల్పే విక్రాంతిని–

ఢిల్లీలో మారుమూల పల్లీలో,
ఆపన్నుల గల్లీలో,
సంపన్నుల విల్లాలో, ఒకేసారి
వెల్లువగా ఉప్పొంగే చల్లని సీమంతిని–

ఏటేటా వచ్చి మిమ్ము
హెచ్చరించు జయంతిని
ఇలను పసిడి కలలు పంట
పొలము చేయు శ్రీమంతిని
చెలిమి పొలములందు, కలిమి
చిందే భాస్వంతిని– నేనే॥

కమకమ్మని ఆశయాల
గుమ్మడి పూబుట్టలను
మోసుకొని తెచ్చాను
ఆశల దేశపుటమ్మను
చూశారా నన్ను
సూర్యముఖహాసంతిని– నేనే....

## ఆశాగళాలు :

చూశాము, చూశాము
చూశాము నిన్ను
నీ పాదముద్రల్లో
జ్ఞాపకాల గొబ్బిళ్ళు–

గజ్జెకట్టి గంగిరెద్దు గంతులు వేశాయి
డోలుకొట్టి దిక్కులన్ని ఈలలు వేశాయి–
పొలాలేమొ మురిపాల గాదెలు కట్టాయి
సంబరాలు అంబరాల అంచులు ముట్టాయి– చూశాము....

గరికపూలు లేచి, సిరుల
గడప త్రొక్కాయి
పసుపు కుంకుమలు, మట్టికి
పారాణి పెట్టాయి– చూశాము....

ప్రత్తిపూల తోటల్లో
శనగచేల ఆటల్లో
పరవశించిపోయెనవే
దొరపొగాకు తోటలు
చెరుకు, అరటి కోటలు– చూశాము....

## నిరాశాగళాలు :

చాలు చాలు మీ కవితలు
చాలించండీ !
సంక్రాంతికి వాస్తవాలు చూపించండీ !

గర్వాంధులు, స్వార్థపరులు
గంగిరెద్దు వారైతే
డొక్కమాడు పేదన్నలు
డూడూబసవన్నలు— చాలు॥

త్యాగం చేసేవారిని
భోగం మింగేస్తున్నది
శక్తిపరులనేమో
కుయుక్తులు కొరికేస్తున్నవి— చాలు॥

చదువులు సంస్కారాలు
హక్కులు అర్హతలు
కులమత కలహాలలోన
కూలి, కుమిలి పోతున్నవి— చాలు॥

మనిషిని పీడించి, మనిషి
మహిషాసురుడవుతుంటే
మనిషిలోని దేవునికి
మతిపోతున్నది నేడు— చాలు॥

## సంక్రాంతి :

విన్నాను విన్నాను భిన్న స్వరాలు
కన్నాను కన్నాను కలలు నిజములను
మనిషితో పోరాడు మంచి చెడుగులను—

మానవుడె వానరుడు
మానవుడె దానవుడు
మానవుడె మాధవుడు
మానవా ! నీ వెట్లు
మారదలచెదవో:— విన్నాను॥

తెలిసినది తెలియనట్లు
తెలియనిది తెలిసినట్లు
వర్తించు మిము మీరే
వంచించుకోనేల ?— విన్నాను॥

అణువు డొక్కను చీల్చి
అంతరిక్షము గెలిచి
సాధించినది, ఒరుల
బాధించు టేనా? — విన్నాను॥

మనిషి మనిషిని పీల్చి
మనుట మానిననాడె
సమతతో సహృదయత
సఖ్యమందిన నాడె
'సంక్రాంతి' నా పేరు
సార్థకమైపోవు — విన్నాను॥

ప్రజావాణి :

క్షేమ్మునది ఒడ్డుమీద
తెలుగుల సంక్రాంతి
మలయా రబ్బరు తోటల
వెలుగుల సంక్రాంతి

తీర తీరాలలో
భారత సంక్రాంతి
లోకమంతటా మ్రోగే
శ్రీకర శుభగీతి — ధేమ్సు॥

ఆశయాలు నెరవేర్చే ఆలోచనలు
ఆకాంక్ష తీర్చే అనుభూతులను
అందించే సంక్రాంతికి
ఆత్మాభివందనం
అందరమొకటైపోతే
అవనే నవనందనం— ధేమ్సు॥

సత్యాలను శోధించి
సంక్రమణం సాగించి
చుక్కలతో శూన్యముతో
చుట్టరికం నెరపుదాం
మనిషికి దేవునికి ఒకే
మాతృభాష నేర్పుదాం— ధేమ్సు॥